అంఆ

# ఇంద్ర ధనస్సు అమ్మ



యమ్. దత్తాత్రేయశర్మ

అంత

# ఇంద్ర ధనస్సు అమ్మ



యమ్. దత్తాత్రేయశర్మ

ప్రథమ ముద్రణ - 2001

ప్రతులు : 1000

ప్రతులకు :
శ్రీ విశ్వజననీ పరిషత్
జిల్లెళ్ళమూడి - 522101
బాపట్ల తాలూకా - గుంటూరు (జిల్లా)

మూల్యము :
పదిరూపాయలు

ముద్రణ : ఆకృతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, చిక్కడపల్లి, హైదరాబాద్, ఫోన్ : 7664525

అంఆ

# ముందు మాట

గగనతలంలో ఒక్క సూర్యుని నుండి వెల్లివిరిసిన ఇంద్రధనస్సు వివిధరంగులలో కనపడుతున్నట్లు సకల విశ్వాన్ని తనలో ఇముడ్చుకున్న మహదాకాశమైన అమ్మ బహుముఖకోణాలలో సర్వతోముఖచైతన్యంతో సర్వానికి సమన్వయమైన దివ్యతేజోభానుడై వివిధ కోణాలలో ఇంద్రధనస్సులా, సాక్షాత్కరిస్తుంది. పరిపూర్ణమూర్తియైన అమ్మ బాహ్యమైన ప్రవర్తనని, విభేద ప్రకటనలని అవగతం చేసుకొనుటలో ఎందరెందరో కృతకృత్యులు కాలేక పోయారు. అమ్మ ఏ విధంగా సర్వానికి సమన్వయమైన ఆదర్శ దీపకళికో ఆరాధ్య దైవమో తెలియచేసెడి ప్రయత్నమే "ఇంద్రధనస్సు అమ్మ" అనెడి ఈ చిన్నపుస్తకం. ప్రేరణ, ప్రయత్నం సర్వం తానే అయి అమ్మ వ్రాయించి అక్షరబద్ధం చేసిన ఈ పుస్తకం అందరికి అక్షరదీపం కావాలని వేడుకుంటూ అక్షరస్వరూపిణి అమ్మకే అంకితం చేస్తున్నాను.

ఇట్లు
పీయూష

# కృతజ్ఞతలు

ఈ పుస్తకప్రచురణకు ఆర్థికసహాయం అందచేసి సహకరించిన సోదరీ సోదరులు శ్రీ అన్నం రాజు శాయి , శ్రీమతి ప్రభల సావిత్రి , శ్రీ పి.యస్.యన్. మూర్తి , శ్రీ ఎ. రామచంద్రారెడ్డి , శ్రీ పి. శ్రీరామమూర్తి, శ్రీ యన్. లక్ష్మణరావు, కె. రవీంద్ర గార్లకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను. వీరందరికి అమ్మ ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రసాదించాలని ప్రార్థిస్తున్నాను. అనిర్వచనీయమైన అమ్మ ఆశీస్సులతో సర్వజనులు సుఖసంతోషాలతో వర్ధిల్లాలని విశ్వకళ్యాణకారిణియైన విశ్వజనని నికి అంజలిఘటించి వేడుకుంటున్నాను.

ఇట్లు
పీయూష

## అంఆ

# ఇంద్రధనస్సు అమ్మ

### దైవం ఒక రూపంతో అవతరించటానికి కారణం :

"శక్తిని గుర్తించటానికి రూపమే ఆధారం. అంతటా ఉన్న దైవం శరీరంతో రావటానికి కారణం అదే" అన్నారు అమ్మ. అనంతశక్తియైన అమ్మ పరిమితమయిన రూపంతో అందుకే అవతరించినది. అమ్మ అవతరించటానికి 40 సంవత్సరములకు పూర్వమే మౌలాలీ అనెడి వ్యక్తికి ఒక బాలికగా దర్శనమిస్తుంది. అమ్మ జననానికి ముందు 35 సంవత్సరాల ముత్తైదువగా అమ్మ తండ్రికి దర్శనమిస్తుంది. "నేను అమ్మను. మీ ఇంట్లో పుడతాను" అని చెప్పారు. మన్నవలో రాజరాజేశ్వరి చెన్న కేశవస్వామి ఆలయంలో ప్రదక్షిణాలు చేస్తూ ఉండేవారు అమ్మ తండ్రి. వీరు పొన్నూరులో చింతచెట్టు క్రింద కూర్చుని "ఈసారి పుట్టే బిడ్డ అయినా దక్కేనా" అని వారు అనుకుంటూ ఉండగా ఎదురుగా చెన్నకేశవస్వామిగా కనపడి ఆ స్వామి ఒక బాలికగా మారి అదృశ్యమవుతుంది. అమ్మ ఈ దర్శనాల అనంతరం అవతరిస్తుంది. అమ్మ తండ్రికి, మౌలాలికి ఇచ్చిన దర్శనాలు ఆద్యంత రహితమయిన అమ్మ దివ్యత్వానికి నిదర్శనాలు. ఈవిధంగా అమ్మ భూమిపై అవతరించటం

జరిగింది. పుట్టినప్పటినుండి ఎన్నో అద్భుతాలు జరిగినవి. నెలల పిల్లగా ఉన్నప్పుడు శాంభవీముద్ర వచ్చింది అమ్మకి. ఆధ్యాత్మిక స్థితుల కోసం సాధకులు ముద్రలు వేస్తారు. కాని ఏ లక్ష్యం కోసం ముద్రలు వేస్తారో ఆ లక్ష్యమే తానని తెలియచేసింది ఈ సంఘటన వలన అమ్మ. "ముద్రలు వేయటంకాదు రావాలి" అంటారు అమ్మ. అంటే దేనికోసం వేస్తారో ఆ స్థితే తానయినప్పుడు వేయటం కాక వస్తయ్. ఆస్థితే అమ్మ. పసిపిల్లగా ఉన్నప్పుడు ఎందరికో వివిధ దేవదేవీరూపాలలో దర్శనమిచ్చారు. ఈవిధంగా అమ్మ అవతార స్వరూపిణియై అవనీస్థలిపై అవతరించినది.

అమ్మ ఒక సాధారణ మధ్యతరగతి కుటుంబంలో జన్మించింది. ఆంధ్ర ప్రదేశ్ గుంటూరు జిల్లా పొన్నూరు మండలం 'మన్నవ' అనెడి చిన్న గ్రామంలో 1923 చైత్రశుద్ధ ఏకాదశినాడు తెల్లవారు ఝామున 4 గంటలకి గుడిలో జేగంటలు మ్రోగుచుండగా రంగమాంబా-సీతాపతుల రత్నగర్భ పుణ్యమ్ముల పంటగా అమ్మ అవతరించినది. తండ్రి మన్నవ సీతాపతి శర్మగారు మన్నవ గ్రామకరణం.

**కారణావతారాలు** : వాస్తవానికి దైవం పరిపూర్ణమయినప్పటికి అమ్మకి పూర్వం వచ్చిన అవతారమూర్తులు ఒక లక్ష్యసాధన గమ్యం పెట్టుకుని అవతరించటం జరిగింది. ఉదాహరణకి పూర్వపు అవతారమూర్తులు దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసి వారి రాకకు ఒక కారణం తెలియచేసి విశ్వరంగ స్థలం నుండి

అవతారాలు పరిసమాప్తి చేశారు. "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం" అని చాటిచెప్పి మంచి చెడుల వేర్పాటు ధోరణితో కూడుకున్న కారణావతారాలుగా ఆవిర్భవించారు.

## అకారణ అవతారం-సర్వబాధ్యతలు తనపై వేసుకున్న పరిపూర్ణత్వం:

మంచి చెడులు గుణగణాల భేదానికి అతీతంగా అందరిని సమాదరించి దరిచేర్చి అందరి అమ్మ అయింది. • "సృష్టి అనాదినాది అందరూ నా బిడ్డలే" అని సమదృష్టి చూపిన అమ్మ సకల సృష్టిపట్ల, విశ్వమానవ కోటిపై వాత్సల్యామృతాన్ని వర్షింపచేసి ప్రేమావతారమూర్తియై నిలిచినది. అమ్మ చిన్నపిల్లగా ఉన్నప్పుడు వరసకి అమ్మ పినతండ్రియైన మన్నవ రామబ్రహ్మంగారు అమ్మని వాసుదాసస్వామి దగ్గరకు తీసుకుని వెళ్ళి "తల్లిలేని పిల్ల" అని పరిచయం చేస్తే, వాసుదాసస్వామి "చల్లని తల్లి అంటూ అందరికీ నీమీద ప్రేమ ఉండేటట్లు దీవిస్తాను" అంటే అమ్మ "నాకే అందరిపై ప్రేమ ఉండేటట్లు దీవించండి" అంటారు. ఈవిధంగా సాకార రూపందాల్చిన ప్రేమమూర్తి అమ్మ.

పూర్వపు అవతారాలు పరాక్రమ శక్తి చూపి దుష్టులను నిర్జించారు. కాని అమ్మది సహనశక్తి. ఎక్కడ శక్తేతానై ఉంటుందో అక్కడ సహనం సహజమవుతుంది. నిర్జించటం కాక లొంగిలొంగ తీసుకుండే విశిష్టమయిన

పద్ధతి అమ్మది. అమ్మది సహజ సహనం. "సర్వధర్మాలు పరిత్యజించి నన్నే శరణువేడితే నేనువారి సర్వ పాపములను బాపి మోక్షాన్ని ఇస్తానని, ఇతర చింతనలు లేకుండా ఎవరైతే నన్ను ఉపాసిస్తారో వారియోగ క్షేమములు నేను భరిస్తానని" పూర్వపు అవతారమూర్తులు ఇతర మహాత్ములు, అవతల వారు చేసిన దానిని బట్టి మేము ఇస్తామని బేరసారాలు పెట్టారు. అదీకాక అన్నీ పరిత్యజించి ఇతర చింతనలు లేకుండా కూర్చోగలిగితే అతనే భగవంతుడు అవుతాడు కదా! ఇంకా అతనికి భగవంతునితో పనియేముంది? మరొక ముఖ్యవిషయం వారిని దూషించి ద్వేషించినవారిని సంహరించారు. ఇక అమ్మ విషయానికి వస్తే "నీకు విశ్వాసం ఇవ్వవలసింది నేనే. తల్లే సరెండర్ అవుతుంది. బిడ్డని ఎత్తుకోవాలంటే తల్లి వంగాలి. బురద పూసుకున్నా క్షాళనం చేసుకొనవలసిన బాధ్యతనాది. మరొకస్థాయికి వెళ్ళి బురదతోనే ఎత్తుకుంటాను. తల్లి బిడ్డలు అన్న తరువాత మీ భక్తితో పని ఏమిటి?" అన్నారు. ఏ బేరసారాలు లేని మహోజ్వల పరిపూర్ణ అవతారం అమ్మ. ఇంతటి పరిపూర్ణ బాధ్యత భారం వహించిన అవతారం ఇతఃపూర్వం లేదు. తనని దూషించి ద్వేషించి వ్యధలు పెట్టి కత్తులు పెట్టికోసిన వారికి కూడా గోరుముద్దలు పెట్టి భాషాతీత భావాతీత వాత్సల్యమూర్తియై బాధలు పెట్టిన వారిని సహితం ఉన్నతంగా మలచిన సహజ సహన స్వరూపిణియైన ఒక అపూర్వ అవతారమూర్తి. పూర్వపు అవతారాలను మించిన అవధులు లేని సీమలో విహరించిన అవతారమూర్తి అమ్మ అవనీస్థలిపై నిలచినది.

## దివ్యపథమూర్తియై కూడా మానవతా పరిధిలో బాధలు :

ఎంతటి దివ్యత్వం ఒకవైపు విరాజిల్లుతూ ఉంటుందో అంతటి మానవత్వం మరొకవైపు సాక్షాత్కరిస్తూ ఉంటుంది అమ్మలో. మానవ స్వరూపంలో ఉన్న అమ్మ మానవతా ధర్మానికి అనుగుణంగా జీవితాన్ని నడిపింది. శారీరక సంబంధమయిన వ్యాధులు, మానసిక వ్యధలు, ఎన్నో అవమానాలు మానవ పరిధికి ఊహకి అందని రీతిలో సర్వసాధారణంగా అనుభవించింది. ఏ బాధలేని స్థితిలో మానవునికి ఆదర్శం ఉండదు. మానవుని ప్రవృత్తి సహజంగా ఏవిధంగా ఉంటుందంటే "అవతారమూర్తులు ఏ బాధలేని వారు కనుక వారు హాయిగా కూర్చుని, వారి లక్ష్య మార్గంలో నడిచారు. మనకు సాధ్యంకాదు" అని అకర్మణ్యులై అవకాశవాదు లవుతారు. అందువలన అందని విశిష్టతత్త్వంతోపాటు, మానవతా పరిధిలో ఆదర్శం ఉన్నప్పుడే మానవుడు స్ఫూర్తిని పొంది జీవన పథంలో ఉన్నతంగా ఉద్యమిస్తాడు. బాధాగాధల విషాదఘట్టాలకి కృంగిపోకుండా ఉన్నతంగా రూపాంతరం చెందటానికి వాటినే సోపానాలుగా తీసుకుంటాడు. మానవాదర్శానికి పరాకాష్ఠగా మానవరూపంలో ఉన్న అమ్మ అన్ని బాధలు అనుభవించింది. పైపెచ్చు "బాధే చైతన్యం అని, బాధలేని బ్రతుకు వ్యర్థమని, బాధ కూడా భగవంతుడే" అని ప్రబోధించి మానవీయతలో దివ్యత్వాన్ని జోడించి అనుభవ పూర్వకమయిన తన జీవితం ద్వారా మార్గదర్శనం చేశారు అమ్మ.

పరిపూర్ణులు - అవతారమూర్తుల బాధల్ని గురించి "శారదాదేవి" పుస్తకంలో పేజి 76-77లో ఈవిధంగా ఉన్నది : "అవతారమూర్తులనగానే వారు మన యొద్దనుండి పూజలు విందులు గైకొనుటకే దిగి వత్తురని కష్టలేశమయినను వారిని స్పృశింపదనియు భావింతురు. వాస్తవానికి ఏ ఇతర మానవ వ్యక్తియు సహింప లేనన్ని కష్టములు వారి పాలపడును. బక్కచిక్కినవారికి తేలికమూట బలశాలికి బరువుమూట. అందరికంటే బలశాలి అవతారమూర్తి కనుక మానవజాతి సమిష్టియై మోయు దుఃఖభారమంతయు వారి భుజముపై నిలుచును. మనలో సీతారాముల చరిత్రకాని, ఇతర మహాత్ముల చరిత్రలుకాని చూచితిరేని ఈ సత్యము తేటతెల్ల మగును. "ఆధ్యాత్మికాభివృద్ధిచేకూరిన కొలది వ్యక్తిత్వము నశించి విశ్వత్వము స్థిరపడును. వ్యక్తి తన యొక్క ఇబ్బందులకే దురపిల్లును. కాని మహాయోగి మానవ బాధలన్నింటికి కుమిలిపోవును". ఇక్కడ ముఖ్యంగా గమనించవలసినది అమ్మ విషయంలో మరొకటి ఉన్నది. అమ్మకి ఆధ్యాత్మికాభివృద్ధి అంటూ సాధకుల వలె చేకూరటమంటూ ప్రత్యేకించి ఏమీలేదు. పూర్ణత్వమే తానయినది. వ్యక్తిత్వంలో విశ్వత్వం - విశ్వత్వంలో వ్యక్తిత్వం నిలిచిన ఒక అపూర్వ అవతారమూర్తి అమ్మ. దీనినే అమ్మ "నేను నేనైన నేను" అన్నారు.

**మాధవి అయిన అమ్మ మానవతా పరిధిలో సర్వసామాన్య మానవిలాగ వ్యవహరించిన తీరు :**

పసితనంలో తల్లితండ్రుల మధ్య తాతలు పినతండ్రుల మధ్య పెరిగింది. మన్నవలో గొల్ల నాగమ్మ చెంత పెరిగింది. వాస్తవానికి అమ్మకి పరిధి లేదు. కాని మానవిగా వ్యవహరించింది. తన వారందరికి బంధువైన సీతాపతి శర్మగారి బిడ్డగా గోచరించేది. మనలాగే బాధపడటం, ఆనందించటం, ఏదైనా విషయం తెలుసుకోవాలన్నా, తెలియచేయాలన్నా మరొకరిచేత కబురు చేయటం ఇటువంటి పద్ధతిలో వ్యవహరించేది. చిన్నపిల్లగా ఉన్నప్పుడు అమ్మతో ఆడుకున్నవారు చెప్పిన విషయం ఒకటివిన్నాను. ఆటలలో కూడా తాను తల్లిపాత్ర వేసేదని. మరొకరు ఈవిధంగా చెప్పారు. "మరిడమ్మగారి వెంట తాతమ్మా! తాతమ్మా! అంటూ తిరిగేదని. అమ్మ వదిన రంగమ్మగారు తాను కాపురానికి వచ్చిన క్రొత్తలో అమ్మ వ్యవహరించిన తీరుని గురించి ఈవిధంగా చెప్పింది. అమ్మ వదినగారికి జుట్టు బాగా ఉండేదట. ఆవిడ తలుపు దగ్గర కూర్చుంటే జుట్టును తలుపు గడియకి ఆమెకు తెలియకుండా కట్టి ఏమీ తెలియనట్లు ఇవతలకి వచ్చి "వదినా అన్నయ్య పిలుస్తున్నాడు" అని అమ్మ వెళ్ళిపోయేది. వెంటనే ఆవిడ లేచి రాపోతే తలుపుకూడా ముందుకు వచ్చి వెనక్కి తిరిగి చూస్తే తలుపుకి తన జడకట్టి ఉండేది. ఈవిధంగా అన్నాచెల్లెళ్ళు నన్ను ఆటపట్టించే వారని చెప్పింది. కృష్ణుని కొంటెతనం అమ్మలో ఉండేది. ఏమీతెలియనట్లు అడగటం తెలుసుకోవటం, అమాయకంగా కనపడటం, కొన్ని ఏమిటి? ఇంత అమాయకంగా అడుగుతుంది? అన్నట్లు అడిగేది. ఇటువంటివి అమ్మ వ్యవహారంలో

కనపడేవి. ఒక్కొక్కసారి జ్వరం వస్తే జుట్టంతా అట్టలాగ జడలు కట్టుకునిపోయి ఏమైపోతుందో అన్నట్లు కంగారు పడేవారు ఇతరులు. ఒక్కక్షణంలో దివ్యత్వం మరొక క్షణంలో మానవత్వం ఈవిధంగా అంతంలేని అమ్మ మానవతా పరిధిలోకూడా అంతుపట్టని రీతిలో వ్యవహరించేది.

మహాభక్తులు జ్ఞానులు, యోగుల చరిత్రలు గమనిస్తే, వారికి శారీరక బాధలు, లోకులు పెట్టెడి చిత్రహింసలు, ఆర్థిక దారిద్ర్యాలు, అవరోధాలు అవమానాలు మొదలైన వానితో వారి జీవితాలు నిండి నిబిడీకృతం అయినట్లు గమనిస్తాం. కాని మానవతా పరిధిలో అనుభవించెడివన్నీ వారిని పరమ పదానికి తీసుకుని వెళ్ళెడి సోపానాలు అయినట్లు అవగతం అవుతుంది. కనుక మానవతా పరిధిలో అనుభవించెడివన్నీ లక్ష్యమందు అకుంఠిత నిష్ఠ ఉంటే దివ్యపథాను సంధానానికి ఆటంకము, లోపభూయిష్టము కాకపోగా అవే సోపానాలైనవి. అటువంటిది పూర్ణత్వమే తానైన అమ్మ, మానవిగా వ్యవహరించిన తీరుకాని, పెరిగిన పంథాకాని దైవీయమయిన స్థితికి ఆటంకము అపరిపూర్ణము కాకపోగా వాటితో లీలామానుషమూర్తియై ఆడుకుంది. మరొక మెట్టుపైకి వెళ్ళి ఇవి అన్నియు కూడా దివ్యపథాలే అని చాటిచెప్పింది. ఇదే అద్వైతానుభూతికి పరాకాష్ట. "కృష్ణ చైతన్యసంఘ్" వారి పుస్తకంలో ఈవిధంగా ఉన్నది. "మానవతా పరిధిలో అనుభూతిలేకపోతే ఆ అనుభూతిలేని అసంపూర్ణం అక్కడ ఉన్నట్లే" అని ఉన్నది. పూర్వం రాష్ట్రంలో పేరుగాంచిన మరొకరు రేపల్లె రావటం జరిగింది. అమ్మ సన్నిధిలో వారి ప్రస్తావన వచ్చి

అక్కడ ఉన్న గుంటూరు వాస్తవ్యులను ఈవిధంగా అడిగింది. "ఆయనని (రేపల్లె వచ్చినవారిని) చూశావుట్రా?" అని వెంటనే ఆయన "ఎవరూఁ... ఏమిటీఁ... నేనేం చూడలా అయినా రూపాయి దొరికితే, కానీతో పని ఏమిటి?" అంటూ వెళ్ళిపోయాడు. అక్కడ ఉన్న ఒకామె "అఁహ్హాఁ... హ్హాఁ... అనవలసిన ఒక్కమాట అని వెళ్ళాడు". అన్నది అమ్మ "ఏమిటి?", అంటే గుంటూరు వాస్తవ్యులు అన్నమాట చెప్పింది. వెంటనే అమ్మ సీరియస్‌గా ముఖంపెట్టి "రూపాయికి 64 కానులలో ఒక కానీ తీసివేస్తే 63 కానులు రూపాయి కాదుకదా? ఆ ఒక్క కానీ తీసివేసిన లోటు (అసంపూర్ణం) ఉంటుంది కదా"? అన్నది. కనుక పరిమితత్వాన్ని (మానవత్వాన్ని) వదిలి అతీతంగా ఉండటం కూడా అపరిపూర్ణమే. పరిమితత్వంతో విలీనమయి (మానవత్వంతో) అతీతంగా ఉండటమే పూర్ణత్వం యొక్క విశిష్టత, ఆదర్శం కూడాను. ఇందువలన అమ్మ జీవితంలో మానవతా పరిధిలో వ్యవహరించిన తీరు అనుభవించిన పంథాలోని ధర్మసూక్ష్మాన్ని గ్రహించి ఇటువంటివన్నీ అమ్మ యొక్క పరాకాష్ఠని తెలియచేసెడివిగా గ్రహించి (అర్థం చేసుకుని) ఆరాధించుదాం.

## అమ్మ వివాహం - పెళ్ళి చేసుకొనటానికి కారణం చెబటం :

అమ్మ వివాహం బాపట్లలో 1936 మే 5వ తేదీన జరిగింది. అమ్మ మేనత్త బ్రహ్మాండం కనకమ్మగారు, సుబ్బారావుగార్ల (మావయ్య) కొడుకు

అయిన నాగేశ్వర రావుగారితో వివాహం జరిగింది. గృహస్థాశ్రమాన్ని గురించి చెబుతూ "అన్ని ఆశ్రమాలు ఒక స్థితినే ఆశ్రయించి ఉన్నాయి. ఆ ఒకటే ఒకటి. అదే ఇవన్నీ పెళ్ళిలో పెద్దపులి ఉన్నదని భయపడే మీ భయాన్ని పోగొట్టటానికి నా పెళ్ళి. ఏ ఆశ్రమానికి ఆ ఆశ్రమం అన్నీ గొప్పవే. ఇందులో ఉండే ధర్మాలు ఇందులో ఉన్నాయి."

## కళ్యాణకలాపాన్ని యోగశాస్త్రంతో జీవితంతో ఈవిధంగా సమన్వయం చేశారు అమ్మ :

నాన్నగారిని అమ్మ ప్రక్కన చేర్చి కాడినెత్తి మీద పెట్టి రంధ్రంలో గుండా ఆవుపాలు ఆవునెయ్యి వదిలిపెడతారు. ఆ రంధ్రమే సుషుమ్నా ద్వారం అనుకుంటుంది అమ్మ. అంత చిన్నద్వారంలో ఇద్దరూ కలిసి బాట తప్పకుండా ఇద్దరూ ఒకేకాడిని నెత్తినవేసుకుని జీవనయాత్ర సాగించాలి. పెళ్ళికొడుకు పెళ్ళికూతురు ఇడా పింగళనాడులనుకుంటుంది. కుడి ఎడమలు రెండూ ఒకటిగా నడవవలసిందే. కుడి ఎక్కువ లేదు ఎడమ తక్కువలేదు. కుడికాలు ఎడమకాలు ఉన్నదనుకోండి. ఒకకాలు వేసినప్పుడు ఒకకాలు తీస్తుండాలి. రెండుకాళ్ళు సమంగా వేయవలసిందే. ఈ నడక ఎంతో నడత అంతే. నాన్నగారి నెత్తిమీద పాలు వదిలారు. బాధ్యతలు ఇద్దరికి ఒకటిగానే ఉన్నవని చెబటం కాబోలు. సూత్రధారణకి మేళతాళాలు వాయిస్తారు. సూత్రధారణ జరుగుతుంది. అక్షతలు వేస్తారు. అక్షతలు వేయటంలో

అర్థం క్షరం కాకుండా అక్షయంగా ఉండమనా వీరి ఉద్దేశ్యం? అంతే అయి ఉంటుందిలే అని సమాధానం చెప్పుకుంటుంది అమ్మలో అమ్మే. "తలంబ్రాలు అంటే తలంపులు. అక్షతలతోనే పొయ్యటానికి క్షరం కాని తలంపులు కాబోలు నాన్నగారికి కలిగిన తలంపులు అమ్మ నెత్తిమీద, అమ్మ తలంపులన్నీ నాన్నగారి నెత్తిమీద వేసినట్లు అమ్మ భావిస్తుంది. ఈ కలాపాన్ని జీవితానికి యోగానికి సమన్వయం చేస్తూ తెలియచేసిన అమ్మ ఉద్దేశ్యం ఇది.

## బంగారం-వెండి ఉంగరాల ఆటలో జీవనతత్వాన్ని వివరించటం:

ఒక బిందెలో నీరుపోసి బంగారం-వెండి వేసి బంగారం ఎక్కువని వెండి తక్కువ అని భ్రమ కల్పించి ఎవరు గెలుస్తారో అని ఒక ఆట పెడతారు. ఒక బిందెలో రెండు చేతులు కలిపి ఆడుకోవటం, గెలుపు-ఓటమి, మంచి-చెడ్డ, హెచ్చు-తగ్గు వీటితో ఆట ప్రారంభం. ఈ పాత్రతో ఈ ఆట, జీవయాత్ర చేయాలి. ఈ బిందెతో నీరు తెచ్చుకుని ఆగిన్నెలతో అన్నం వండుకుని ద్వంద్వాలను కాళ్ళు చేతులు తన్నుకుంటూ ప్రకృతి పురుషులిద్దరూ ఈ ప్రకృతి నడుపుతారు. ఈవిధంగా ఈ కలాపంలోని ఉద్దేశ్యం తెలియచేశారు.

**బ్రహ్మముడి** : బ్రహ్మముళ్ళు అంటే వీరు వేసి విప్పేవి కాదు కదా? (సదా ఉండేది బ్రహ్మతత్వం. అది వేసిన బంధం ఇది. అది ఎట్లా శాశ్వతమో ఇదీ అట్లాగే శాశ్వతం కావాలనే ఉద్దేశ్యం). బ్రహ్మముళ్ళు వేసినప్పుడు ఒకేసారి

వంగటం, లేవటం నడవటం జరుగుతుంది. ముడివేసినప్పుడు ఎలా ఉన్నారో, ఏ భావం కోసం ముడివేశారో ఆ భావం ఎప్పుడూ ఉండేదే బ్రహ్మముడి. మనోవాక్కాయ కర్మల ఇరువురు అలా నడుచుకోవటమే దాంపత్యం.

**గృహప్రవేశంలో జరిగెడి కలాపాన్ని పదార్థ ధర్మానికి సృష్టిధర్మానికి సమన్వయం చేసి చెబటం :**

లోపలి గుమ్మంలో అడుగుపెట్టే సరికి నాన్నగారి పెద్ద మేనత్త సుబ్బమ్మగారు ఎఱ్ఱనీళ్ళు తీసుకుని వస్తుంది. ఎఱ్ఱనీళ్ళు చూడగానే అమ్మకు సున్నము, పసుపు వేరువేరుగా ఉన్న రూపాలు గుర్తుకువస్తాయి. నీళ్ళు పొయ్యగానే కలిగిన రూపాంతరం కదా ఇది. వీరిలో ఒకరు పెళ్ళికూతురు, ఒకరు పెళ్ళికొడుకు అనుకుంటుంది. ఇవే శ్వేతధాతువులు. శుక్లశోణితాలు. సున్నం రూపం పసుపు రూపం లేదు కదా? ఇప్పుడు రక్తరూపం అయింది. రక్తంలోనే వీర్యం పుట్టింది. వీర్యంతోనే రక్తం పుట్టింది. ఏది ముందు ఏది వెనక అనేది లేదు. ఒకదాని వెంట ఒకటి ఉన్నాయి. ఇదే ప్రకృతి పురుషులు. ఇట్లా ఆలోచిస్తూ ఎఱ్ఱనీటిని చూస్తూ ఉంటుంది. తరువాత గృహప్రవేశం జరుగుతుంది.

**వివాహబంధంలో కల ధర్మసూక్ష్మం** : "ద్వంద్వాలతో ద్వంద్వాన్ని జయించాలి. సర్వాన్ని అనుభవిస్తూ సర్వాన్ని విడిచిపెట్టేది వివాహం."

ద్వంద్వంతో ద్వంద్వాన్ని జయించటం అంటే ముళ్ళుని ముళ్ళుతో తీయటం లేక అంతకంటే గట్టిదైన పిన్నీసుతో తీయటం. అంటే గుణాలని నిరోధించటం కాక గుణాల మూలంగా భగవంతుని పొందటం. చెలరేగే గుణాలని పటిష్టమయిన పవిత్ర గుణంతో (భావంతో) జయించటం. "సర్వాన్ని అనుభవిస్తూ సర్వాన్ని వదిలి పెట్టేది వివాహం". అంటే సంగత్వ నిస్సంగత్వాల మేలు కలయిక. ఇదే పరిపూర్ణత్వం. అట్టి స్థితిని చేరటమే వివాహంలో కల ఉద్దేశ్యంగా ప్రబోధిస్తూ ఇతఃపూర్వం సూక్తిని చెప్పింది. కళ్యాణ కలాపాలలోని స్థూలమయిన జీవిత తత్వాన్ని, సూక్ష్మమయిన పదార్థ ధర్మాన్ని భావాత్మక బంధాన్ని, ఆధ్యాత్మిక ధర్మ సూక్ష్మాన్ని తెలియచేస్తూ వివరించారు అమ్మ. సర్వమూ తానే అయి సర్వానికి అతీతమయిన అమ్మ కళ్యాణం ఈవిధంగా జరిగింది.

**గృహస్థ జీవితం - సంసారం** : "నీటిలో పడవ ఉండవచ్చు. పడవలో నీరు ఉండకూడదు. సంసారంలో నీవు ఉండాలి. సంసారం నీలో ఉండకూడదు. అని అమ్మ ఉవాచ. కోట గోడలోపల ఉండి పోరాటం లాంటిది గృహస్థ జీవితం. కోట గోడ విడిచి పోరాటం లాంటిది సన్యాసం." ఈ విధంగా గృహస్థ, సన్యాస జీవితాలని విడమరచి తెలియచేశారు అమ్మ. "సారం కలిగింది సంసారం, సంసారం సాగరం అన్నారంటే చంపేదని కాదు నిరంతరం అలలు ఆటుపోటులు ఉన్నట్లుగా ఒడుదుడుకులు ఉంటాయని, తప్పించుకుంటూ, పడుతూ, లేస్తూ జీవితం సాగించాలి" అని అర్థం అని

వివరించారు. రమణ మహర్షి "కర్మలు కర్మలుగా తామై చెరుపులు కావు (బంధించవు). కర్మ యందుకల రాగ ద్వేషాసక్తి చెరువు చేస్తుంది (బంధిస్తుంది)" అంటారు. దీనినే అమ్మ "సంసారంలో నీవు ఉండవచ్చు నీలో సంసారం ఉండకూడదు" అని వివరించారు. ఒకరు మహర్షిని "సంసారినై ముక్తిని పొందవచ్చా? అని అడిగితే మహర్షి నిస్సంశయంగా పొందవచ్చు. నశించవలసినది అహంకారం. అది నశించకపోతే నేను సంసారిని అనెడి భావం స్థానంలో నేను సన్యాసిని అనెడి భావం వస్తుంది అంతే" అంటారు. అమ్మ పరిభాషలో అహంకారాన్ని నిర్జించే ప్రయత్నమనే పోరాటంలో గృహస్థ జీవనం కోట గోడ లోపలిది అయితే సన్యాస జీవనం కోట గోడ విడిచి పోరాటం లాంటిది. తొలగవలసినది (అహంకారం) తొలగకపోతే ఏదైనా ఒకటే. సరిగ్గా అర్థం చేసుకుంటే సంసారం ఆధ్యాత్మిక జీవితానికి ఆటంకం కాదు అంటారు అమ్మ.

ఈ సంసారం వద్దు. ఈ జన సమూహం వద్దు అని వీటికి దూరంగా వెళ్ళిన "విఠోబా" సహజ నిష్ఠాజ్ఞానియైన "జ్ఞానేశ్వర్"ని ఈవిధంగా అడుగుతారు. విఠోబా : సంసార వ్యాపారము నుండియే సహజ జ్ఞాని ఎట్లు కాగలడు? జ్ఞానేశ్వర్ : బ్రాహ్మణుడు చాండాల వేషము వేసి నటించినను చండాలుడు కాక బ్రాహ్మణుడే అయినట్లు సుజ్ఞానియు అజ్ఞానులతో కూడి బహువిధ నటనముల వుండినను పరమానందానుభోగిగానే ఉండును." అని జ్ఞానేశ్వర్ వివరిస్తారు. అమ్మ చెప్పిన "సర్వాన్ని అనుభవిస్తూ సర్వాన్ని విడిచిపెట్టేదే

వివాహం" అన్న సూక్తి సారాంశాన్ని పైన జ్ఞానేశ్వర్ ఉదాహరణతో వివరించారు.

అమ్మ చెప్పిన ద్వంద్వంతో ద్వంద్వాన్ని జయించేదే సంసారం అనేది విషయ సారాంశాన్ని జ్ఞానేశ్వర్ విఠోబాకి ఈవిధంగా తెలియచేసారు.

విఠోబా : దృగ్రూపముగా ఉన్ననే దృశ్యము పోవునుకాని దృశ్యమందు నుండియే దృశ్యమును ఎట్లా నిరాకరింపగలము? విషము హరింప వేరొక విషము త్రాగిన అది మరణ హేతువు కాదా?

జ్ఞానేశ్వర్ : "విషము హరింప వేరొక విషమయ మయిన ఔషధమునే సేవించినట్లు భయంకరమయిన విషయేంద్రియే కరణాదులను నిశ్శంకయైన దృఢజ్ఞానముచే సంహరించినవాడే సమర్థుడుకాని సదానిష్ఠలో ఉండి విషయ మృగములు ఎక్కడ మీదికి రాగలవో అని భయపడువారికి ఆ భీతియే ఫలితము కాని బ్రహ్మానందము ఒకప్పుడును లభింపదు. బాగుగా యోజించి చూడుడు." ఈ విధంగా పరిపూర్ణ మూర్తియైన అమ్మ గృహస్థాశ్రమ జీవనంలోని సహజ నిష్ఠని గురించి అమ్మ సూక్తుల సారాంశం యొక్క వివరణ జ్ఞానేశ్వర్ యొక్క ప్రబోధంలో ఉన్నది.

గృహిణిగా అమ్మ భర్తని, అత్తగార్ని సేవించింది. బంధుజనాన్ని సర్వులను మాతృవాత్సల్యంతో దరిచేర్చి సేదతీర్చింది. సాధారణ కుటుంబిని చేసిన అన్ని గృహకృత్యాలు చేసింది. ఇది కావాలని లేదు. వద్దని లేదు. సంపద-దారిద్ర్యాలు, సుఖ-దుఃఖాలు ఏవి జీవితంలో వచ్చినా కుంగుపొంగులు లేని మహోదధిలాగ గృహస్థ జీవితం సాగించింది. నదులు ఎన్ని వచ్చిపడినా

తొణకని సముద్రం వలె. ఒకసారి అమ్మ భర్త అమ్మని పొగాకు కట్టెలతో పుల్లలతో ప్యూర్ కాఫీ పెట్టి ఇవ్వాలని, కాని పొగాకు వాసన రాకుండా కాఫీ సువాసన రుచి ఉండాలని అంటే అమ్మ అదేవిధంగా చేసి ఇచ్చింది. అమ్మనాతో ఒక విషయం చెప్పింది. జిల్లెళ్ళమూడి వచ్చిన క్రొత్తలో లాంతర్లలోకి కిరసనాయిలు లేకపోతే పొగాకు విత్తనాలు దంచి నూనెతీసి లాంతర్లు వెలిగించుకునే వారమని చెప్పింది. "ఉన్నదానిలో సంతృప్తిగా గొప్పగా జీవించాలని" అమ్మ ప్రబోధం. ఆవిధంగా జీవించింది. తానుదైవం కనుక ప్రతివారిని ఒకేరకంగా "ఒరేయ్ రారా!" అనేది కాదు. క్రొత్తవారు పెద్దవారు వచ్చినప్పుడు మీరు అని గౌరవపదంతో పలకరించేది. ఒకసారి బాహ్యమయిన ఆచార పరాయణులాంటి వారు వస్తే "మీకు కావలసినవి ఇస్తారు. విడిగా వండుకుని చేసుకొనవచ్చు" అన్నారు. వారు భోజనం చేయకుండా వెళ్తామంటె ఆవిధంగా అన్నారు అమ్మ. ఎవరికి కావలసిన రీతిలో వారిని చూడటం వారికి చెప్పటం జరిగేది. ఒకసారి ఒకాయన విషయం వచ్చి "వారికి మడిగా చెయ్యాలట" అంటే "మడి అంటే హద్దు, వారి హద్దులో వారుంటారు. మన హద్దులో మనం ఉందాం" అన్నారు. అమ్మ, తాను సకలాచారాలకి సకల ప్రకృతికి అతీతమయినప్పటికి సాంఘికాచారాలని సామాజిక మర్యాదలని పాటించేది. అయితే భగవంతుడు విలక్షణుడు కదా? కొన్ని విషయాలలో విలక్షణత్వంతో కూడుకున్న ఆదర్శంతో అతిక్రమించేది. కృష్ణుడు "శ్రేష్ఠులు ఏది ఆచరిస్తారో సామాన్యులు అదే ఆచరిస్తారు. అందువలన సంధ్యావందనాది

క్రతువులు నేను చేస్తాను. నేను ఏ కర్మ చేయవలసిన పనిలేదు." అని చెప్పినప్పటికి తాను ఆచరించినవన్నీ అందరూ చేయగలిగినవే చేయలేదు కదా? 16వేల ఎనిమిది మందికి భర్తయై ఎవరికి వారికి వారి వారి చెంత ఉన్నాడు. అంతమందిని భరాయించి ఏలుకున్నాడు. ఇది అందరికి సాధ్యం కాదు కదా? అయినా తాను ఆ విధంగా చేశాడు. ఈ ఒక్కటే కాదు పుట్టినప్పటి నుండి ఆయన చేసినవి ఎవరికీ సాధ్యం కాదు. కొన్ని లోకులు ఆచరించేవి చేసినప్పటికి, ఎన్నో విషయాలలో విలక్షణంగా అతీతంగా జీవించాడు. అదేవిధంగా అమ్మ కూడాను.

## ఆచరించతగిన వాటి విషయంలో ఉన్నతమయిన ప్రబోధం :

ఉదయం లేచి ముఖము కడుగగానే మొదటిసారిగా అమ్మ సేవించెడి తీర్థం మంగళసూత్ర తీర్థం. గృహిణిగా పతివ్రతగా చేయవలసినది ఆచరించేది. "అందమైన భర్తకాదు, భర్తే అందం. ఐశ్వర్య వంతమయిన భర్తకాదు భర్తే ఐశ్వర్యం" అని ప్రబోధించి జీవించింది అమ్మ. ఆహారం, ఔషధం, విద్య మొదలైన భౌతిక అవసరాలు తీర్చెడి వ్యవస్థ ఏర్పరచినప్పటికి, భౌతిక ఆకర్షణలకి అతీతమయిన హృదయ సంస్కారంతో ఏవిధంగా గృహిణి జీవించాలో తన జీవిత సందేశం ద్వారా తెలియచేసింది. ఇవి అన్నీ భర్తకి కూడా ఉండాలి. "భర్త భార్యకి దేవుడైతే భార్య భర్తకీ దేవతే." అన్నారు అమ్మ. తండ్రియైన సీతాపతి శర్మగారికి చివరి దశలో అపారమయిన

సేవలు చేశారు అమ్మ. అదేవిధంగా అత్తగారిని భర్తని అందరినీ సేవించింది. శంకరుల వారు తానుగా ఎంత మహోన్నత లక్ష్యానికి అంకితమయినా తల్లి యొక్క అంత్యదశలో అత్యవసరమయిన స్థితిలో మాతృమూర్తిని సేవించలేదా? కుటుంబినిగాను-విశ్వకుటుంబినిగాను అమ్మ చూపిన బాధ్యత, వాత్సల్యం గమనిస్తే తనవారిని సేవించటం చూడటం అవసరమే. కాని అదే సర్వం అని సంకుచితం కాకూడదు. ఈ బాధ్యత, వాత్సల్యం ఎవరికి వారు వారికి సాధ్యమైనంత వరకు సాటివారి పట్ల చూపించాలి అనెడి ఆదర్శం కనపడుతుంది. గృహిణిగా అమ్మ పరిమితమయిన కుటుంబంలో సర్వబాధ్యతలు వహించింది. మరొక వైపు విశ్వాత్మతో ఐక్యత చెంది లక్షల కోట్ల మందిని సమాదరించి విశ్వ కుటుంబినియై విరాజిల్లింది.

## తెలియబడటమే కాని తెలుసుకోవటం కాదు అని అమ్మ వాక్యం:

మహోజ్వల మూర్తియైన అమ్మ తనని దైవంగా గుర్తించటానికి అవకాశం ఇచ్చి తెలియబడింది.

అమ్మనెలల పిల్లగా ఉన్నప్పుడు అంధురాలైన కాకుమాను లక్ష్మాయమ్మగారికి బాలికగా దర్శనమిస్తుంది.

చిన్నపిల్లగా ఉన్నప్పుడు బాపట్ల భావన్నారాయణస్వామి గుడి అర్చకులు రంగాచార్యుల వారికి రాజ్యలక్ష్మీ అమ్మవారి వలె దర్శనమిస్తుంది. పురోహితుడు

ప్రఖ్యాసుబ్బారావుగారికి లలితగా భాసించింది. ఏకకాలంలో మరిదమ్మ తాతమ్మకి వారి గురువుగారు మల్లెల రత్తమ్మగా, లక్ష్మణాచార్యులవారికి నరశింహస్వామిగా దర్శనమిస్తుంది.

తిరువళ్ళూరులో పైల్‌మాన్‌కి కృష్ణుడు, ఆదిలక్ష్మిగా దర్శనమిస్తుంది. పతివ్రత మన్నవగోపాలకృష్ణమూర్తి గారి కూతురుకి నాగేంద్రుడుగా దర్శనమిచ్చి తనలో ఐక్యం చేసుకుంటుంది.

గరికపాడులో చాకలి బుచ్చమ్మకి ఇచ్చిన అనుభూతిని అమ్మతో ఈ విధంగా అంటుంది "నీకు దీన్ని గురించి (అంటే మంత్రాల గురించి) చెప్పేటప్పుడు నీ ముఖం చుట్టూ చక్రం కోణాలతో తిరుగుతున్నట్లు ఆ చక్రంలోపల సర్వం ఇమిడి ఉన్నట్లు కనపడింది. ఇంకా సందేహాలకి తావేదమ్మా! ఏది మంత్రాల వల్ల పొందుదామనుకున్నానో అది పొందాను" అంటుంది. సర్వానికి మూలమయిన శక్తిగా అమ్మని దర్శిస్తుంది.

మన్నవలో చండీ ఉపాసకులు కొల్లిమర్ల సూరయ్యగారనెడి వ్యక్తి ఉంటారు. వారు సామాన్యంగా ఎవరినీ ఒప్పుకోరు. శ్రీవిద్య తంత్ర విద్యల మీద వారికి అభిమానం. వారు మన్నవలో చింతల తోపుకి వెళ్తే అక్కడ కూర్చున్న అమ్మని చూసి ఎందుకో తన ఇష్టదైవ మనిపించి చూస్తూ. ఉండగానే అమ్మ శిరస్సులో నుండి రక్తం చిచ్చుబుడ్డల్లే వస్తుంది. అదే సమయంలో భృకుటీలో గుండా వస్తుంది. ఆ రక్తధారకు చెయ్యి అడ్డం పెడితే చేతిలో పడ్డ రక్తం చిక్కటి సువాసన కల భస్మంగా అవుతుంది. అది

ఆయన తింటాడు. ఇంత జరిగినా అమ్మ నిరామయంగా కూర్చుంటుంది. మూలమయిన దివ్యస్పందనే తానైన అమ్మ నుండి ప్రతిస్పందించిన మహోజ్వల ఆధ్యాత్మిక స్థితులు అనుభూతులు ఇవి. ఇట్టివి ఎన్నో అమ్మ చిన్నతనంలో అద్భుతాలు జరిగినవి. ఎవరికి వారు అనుభవిస్తారే కాని విస్తృతంగా జనం గుర్తించరు.

## వివాహం తదనంతరం జిల్లెళ్ళమూడి వచ్చిన తరువాత జనం గుర్తించిన తీరు :

అమ్మ వండిన క్రొద్ది అన్నం ఎంతో మందికి సరిపోయి అక్షయం కావటం ఆ గ్రామస్తుల అనుభవంలోకి వస్తుంది. తిరగమాత పెడుతూ సమాధ్యవస్థలోకి వెళ్తేకాలే భాండీలో చెయ్యి ఉన్నా ఏమీ కాలేదికాదు. నిప్పులు మామూలుగా దోసిలిలో పట్టుకుని వచ్చి బయటపోస్తుంటే చూసినవ్యక్తి స్వయంగా నాతో చెప్పారు. ఈ విధంగా అక్కడ ఎందరో వ్యక్తులకి పంచభూతాలకి అతీతమయిన అమ్మ స్థితి అనుభవంలోకి వస్తుంది. క్షణంలో సమాధ్యవస్థలు రావటం అక్కడ ఉన్న వ్యక్తులు చూస్తారు. ఒకతను తనకు ఉన్న చెడ్డ అలవాటును మాను కుంటానని చెప్పి తరువాత మానుకోలేకపోతే అతనిని అమ్మ అన్నీ అడిగిందని చెప్పాడు. ఎక్కడెక్కడో వారికి జరిగేవన్నీ పూసగుచ్చినట్లు అమ్మ అడిగేది కొందర్ని. ఈ విధంగా అమ్మ సర్వసాక్షిత్వం సర్వజ్ఞత్వం కొందరికి అనుభవం అయ్యేది. ఇటువంటివన్నీ బంధుజనం,

అనుభవం అయిన వారు వారి మిత్రజనంతో చెప్పుకొనటం వలన ఆనోట ఆనోట పడి బహుజనం అమ్మ దర్శనానికి రావటం మొదలుపెట్టారు. కొన్ని ఊర్లనుండి వారికి ఎవ్వరూ చెప్పకుండా అమ్మ ఇచ్చిన అనుభవాలతో వచ్చేడివారు. ఇటువంటివే కాక తనని నిరంతరం దూషించే మిషన్ సాయిబుకి అన్నం లేనప్పుడల్లా అన్నం, పదార్థాలు పెట్టి పంపేది. ఇట్టి మాతృవాత్సల్యం అందరికీ ఆశ్చర్యం కలుగచేసేది. తనకి 35 సంవత్సరాలు వచ్చే వరకు విస్తృతంగా జనం గుర్తించరని, తరువాత గుర్తించి వస్తారని అమ్మ చెప్పారు. కొందరికి పైకి చెప్పట్యానికి ప్రత్యేకించి అనుభవం లేనప్పటికి తెలియని అవ్యక్తాకర్షణతో వెళ్ళేడివారు. "సృష్టికి కారణం అకారణం" అని అమ్మ వాక్యం. మూలమయిన అకారణ దైవం కనుక కొందరికి సరాసరి అట్టి అవ్యక్తాకర్షణ అనుభూతి ఇచ్చి దరి చేర్చేది. జిల్లెళ్ళ మూడి నుండి పిలిస్తే వినపడి వెళ్ళేడి వారు కొంతమంది (దూరశ్రవణం) వారు ఉన్నచోట అమ్మని దర్శించి దేశకాలాతీతమయిన అమ్మ ఉనికికి ముగ్ధులై ఆరాధించెడివారు. అంధులు సహితం దివ్యదర్శనాలు పొంది ఒక్కొక్కప్పుడు వారు ఉన్నచోటి నుండి జిల్లెళ్ళమూడిలో అమ్మ ఆ సమయంలో ఎట్లా ఉందో చెప్పేడివారు. దూరశ్రవణం-దూరదర్శనం తనకి సర్వసామాన్య మవ్వటమేకాక ఇతరులకు కూడా అనుభవంగా ఇచ్చేది. అమ్మ నివసించే పర్ణశాలలో ఒక పుట్ట ఉండేది. ఆ పుట్ట మన్ను అమ్మ ఎవరికి ఇచ్చినా ఘుమఘుమ లాడుతూ సువాసన వచ్చేది ఎంతకాలమైనా. పుట్ట కలుగు

లోంచి వెలుతురు వస్తూ ఉండేది. అక్కడ సాసర్ కాని పళ్ళెం కాని పెడితే దానిలో తీయని తేనెలాంటి పదార్థం పడేది. అవి అమ్మ అందరికీ ఇస్తూ ఉండేది. ఈవిధంగా అమ్మ తాను దైవంగా తెలియబడటం వలన వందలు వేలు లక్షలు కోట్లాది దేశవిదేశ జనం నుండి సకల జీవరాసులు అమ్మదివ్య మాతృవాత్సల్యాన్ని పొంది తరించటం ఒక మహాద్భుతం.

**మాతృత్వంలోని విశిష్టత-ఆదర్శం** : అమ్మలోని అపార మాతృత్వం సకల జనావళికి సర్వజీవరాసులకి అనంత విశ్వానికి సమన్వయం అయి ఉన్నతమయిన రీతిలో ఆరాధ్య భావాన్ని పరివర్తనని తెచ్చెడి విశిష్టత ఆదర్శం ఉన్నది. దివ్యత్వం ఉనికిని కాదనెడివాడు కూడా మాతృత్వాన్ని కాదనలేడు. తల్లిని మాతృత్వాన్ని కాదన్నవాడు మనిషేకాడు. తల్లిలేని జీవరాసిలేదు. "జనని అంటే జన్మస్థానమని" వివరించారు అమ్మ. అనంత విశ్వానికి మూలాధారమయిన శక్తియే జనని. అదే మాతృత్వం. భారం వహించెడి శక్తియే మాతృత్వం. భాషాపదాలలో వివరణ మారినప్పటికి భౌతికవాది కూడా దీనిని కాదనలేడు. అందువలన విశ్వవిజ్ఞానానికి, మానవాళికి, జీవరాసులకి సమన్వయం అయ్యేది అమ్మలోని మాతృత్వం. మాతృవాత్సల్యంలో సేవాతత్పరత, త్యాగనిరతి, క్షాత్రవీర్యం నిష్కామకర్మ సహజంగా జరుగుతవి. పవిత్ర వాత్సల్యం నిండిన వ్యక్తిలో తుచ్ఛమయిన వాంఛలు ఆకర్షణలు విరిగి ఏకాగ్రత పెరిగి జ్ఞాన సముపార్జన పొందటానికి ఆధారభూతమవు తుంది. ఇట్టి జ్ఞానం పవిత్ర వాత్సల్యంతో కూడుకున్నది

కనుక సమాజానికి కూడా ఉన్నతమయిన రీతిలో సమస్యలు తీర్చి సేవ చేయాలనెడి ఇచ్ఛాశక్తిని క్రియాశక్తిని కలుగ చేస్తుంది. ఈవిధంగా అమ్మలోని పవిత్ర మాతృత్వం ఇచ్ఛాజ్ఞాన క్రియా శక్తులను ఉన్నతంగా కలుగచేసి సమిష్టి సంక్షేమానికి ఆధారభూతమవుతుంది. ఈ తత్త్వమే అక్కడపని చేసినప్పటికి అమ్మ-మాతృత్వం అనెడి పేర్లు గుర్తింపు అక్కడ ఉండక చేస్తే ఈ తత్త్వం తాత్కాలికంగా పనిచేసినా, ప్రకృతి సహజమయిన గుణదాస్యానికి, పరిస్థితులకిలోనై శాశ్వతంగా ఆదర్శనిష్ఠ లేకపోవచ్చు. అందువలన అమ్మ రూపం-నామం-తత్త్వం యొక్క స్మరణ అధ్యయనం నిరంతరం వ్యక్తులుగా సమిష్ఠిగా చేసిన ఎడల ఇతః పూర్వం వివరించిన వానివలన మరుగుపడి దూరం కాక జీవితాంతం శాశ్విత ఆదర్శనిష్ఠ అవుతుంది. సమిష్ఠిగా చేసినప్పుడు విశ్వాసంతో పాటు ఉల్లాసం పెరిగి తత్త్వం అవగాహన చేసుకొనటంలో అంతరంగం వికసిస్తుంది. అందరికి ఆదర్శం మాతృత్వంలోని విశిష్ఠత. జగన్మాతృ రూపంలో దివ్యశక్తిని ఆరాధించటం ద్వారా ఆస్తికవాదికి ఆదర్శం-ఆరాధ్యం-మాతృత్వం నాస్తిక వాదికి కూడా ఆరాధ్యం-ఆదర్శం "దేశసేవ దైవసేవ రెండూ వేరు కాదు" అని అమ్మ ప్రబోధం. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అనే దేశభక్తి జాతీయవాదికి ఆదర్శం ఆరాధ్యం అమ్మ. "భూమే తల్లి అయినప్పుడు ఏ భూమి అయినా తల్లే కదా?" అని దేశాంతర ఖండాంతర వాసులను తన ఒడిలోకి తీసుకున్న అమ్మ అంతర్జాతీయవాదికి ఆదర్శం ఆరాధ్యం. దీనినే పూర్వీకులు "మాతా భూమిః పుత్రోహం

పృధివ్యాం. వసుధైక కుటుంబకం" "ఈ భూమే నాకు తల్లి. మానవులంతా భూమి యొక్క సంతతే" అనెడి అంతర్జాతీయ వాదాన్ని ప్రబోధించారు. జాతీయ-అంతర్జాతీయ వాదాలను మించి మరొక దశకు వెళ్ళారుకొందరు. వీరు "కృణ్వంతో విశ్వం ఆర్యం" అన్నారు. "ఈ విశ్వాన్నంతా శ్రేష్ఠతమంగా నిర్మాణం చేస్తాం" అన్నారు. దీనినే అమ్మ "జగత్తేజనని నాకు సృష్టే దైవం" అని విశ్వైక్యమూర్తి అయిన అమ్మ విశ్వైక్యవాదులకు ఆదర్శం-ఆరాధ్యం. సకల జీవులతోను (జంతు క్రిమికీటకాదులు) ఐక్యత చెంది వాటికి నేను అమ్మను అని ప్రబోధించిన అమ్మ "ఆ బ్రహ్మ కీటజనని" తా॥ ఆ బ్రహ్మక్రిమికీటకాదులకు తల్లి" అనెడి జీవకారుణ్య వాదులకు ఆదర్శం-ఆరాధ్యం" అమ్మ అంటే అంతులేనిది. అడ్డులేనిది ఆధారమయినది" అన్నారు. ఇది బ్రహ్మైక్యవాదులకి ఆదర్శం-ఆరాధ్యం దీనినే ఆర్యులు "త్రిపాద మూర్ధ్వముదైత్పురుషః పాదో స్యేహాభవేత్. ఏకాంశేనస్థితో జగత్" తా॥ తనలో ఒక అంశంగా ఈ జగత్తును ధరించి దీనికి మూడు రెట్లు ఉన్నది బ్రహ్మతత్త్వం అన్నారు. ఇదే అమ్మ సూక్తిలో "అంతులేని అడ్డులేని జగతికి మూడురెట్లు అధికంగా ఉండి ఆధారమయినది అమ్మ అంటే" అని ఉన్నది. ఈవిధంగా సకల సామాజిక ఆధ్యాత్మిక వ్యవస్థలకి సమన్వయ సారధి సమైక్యవారధి మూల సూత్రమై భాసిల్లింది అమ్మలోని మాతృత్వం యొక్క విశిష్టత.

## భౌతికమయిన ఉనికికి అతీతమయిన అనుభూతి :

పరిపూర్ణమయిన హృదయాను భూతి కనుక అమ్మది, అమ్మ ఉన్న తీరుకి, పెట్టుపోతలనెడి క్రియలకి అతీతమయిన హృదయానుభూతి మనకు కూడా కలుగుతుంది. పూండ్ల మాణిక్యమ్మగారు మొదటిసారిగా వచ్చినప్పుడు అమ్మ చిన్న పర్ణశాలలో ఉన్నది. అమ్మ ఆవిడ్ని "ఏవేఁ... ఏముందని వచ్చావే ఇక్కడికి" అని అంటే మాణిక్యమ్మగారు "ఇదే వైకుంఠం అనుకుంటున్నాను నీవు సాక్షాత్ ఆది లక్ష్మివనుకుంటున్నాను" అన్నారు. మరి ఈ అనుభూతి పచ్చి భౌతిక దృష్టికి అందేది కాదు. రమణ మహర్షి "సుఖాన్ని వెతుక్కోవాలి కాని ఆనందాన్ని వెతుక్కోనక్ఖర్లేదు" అంటారు. మూలమయిన ఆనందం తానవటం వలన అమ్మసన్నిధిలో అలౌకికానుభూతి, అమ్మ పెట్టుపోతలనెడి క్రియల ద్వారా దివ్యమాతృవాత్సల్యం అనుభవిస్తాము. ఒక్కొక్కప్పుడు క్రియలకి మాటలకి అతీతంగా అమ్మ మౌనం ద్వారాను ఉనికి ద్వారాను పొందుతాము. ఇట్టి స్థితిని ఈవిధంగా వివరిస్తారు. "యోగి తాను చెప్పే విషయం ద్వారా కాకుండా తన ఎఱుక ద్వారా మనల్ని ప్రభావితం చేస్తాడు. భాషకి అందని దానిని తెలియపరిచేందుకే ఈ రెండవది లేని అవతారం అవసరమయినది" అని వివరిస్తారు. అమ్మ పెట్టేది ఇచ్చేది ఏమిటని కాదు, అమ్మ పూర్ణత్వానుభూతి యొక్క ప్రభావం మనకు దివ్యత్వానుభూతిని ఇస్తుంది. "నేను ఏమి చెప్పినా అనుభవం నుండి చెబుతాను" అన్నారు. "చెప్పేది అనుభావం తనలో ఉద్భవించేది అనుభవం" అన్నారు. అనుభవ జ్ఞాన ప్రపూర్ణం కనుక అమ్మ చెంత అట్టి భావానుభూతి కలుగుతుంది.

కలకండ-తీపి రెండూ వేరుకానట్లు దివ్యమాతృరూపం-దివ్య మాతృతత్వం వేరుకాదు. అందువలన అమ్మ సన్నిధిలో దివ్యమాతృత్వానుభూతిని అనుభవిస్తాము.

## వ్యక్తావ్యక్త స్వరూపిణి అమ్మ-భౌతిక వ్యవస్థలోని మార్పులు (వ్యత్యాసాలు) పోలికలు :

"వ్యక్తావ్యక్త స్వరూపిణ్యై నమః" అని లలితా నామాలలో చదువుతాము. "వేళ్ళమధ్య ఉన్నది వేళ్ళుగా ఉన్నది అదే" అన్నారు అమ్మ. రూప సహితం-రూప రహితం రెండూ అదేనని. వాత్సల్యాలయంలో వ్యక్తిగా ఉన్న అమ్మదివ్యదేహం అనసూయేశ్వరాలయంలో భూగృహంలో అవ్యక్తంగా ఉన్నది. అవ్యక్తంగా ఉన్నది కూడా అమ్మే. ఒక చోట ఉండి మరొకచోట లేకపోవటం కాదు. వాస్తవానికి రెండు చోట్ల అవ్యక్తంగానే ఉన్నది. ఇకపోతే వ్యక్తంగా తీసుకుంటే దేవాలయంలో విగ్రహ రూపంలో కనపడుతుంటే వాత్సల్యాలయంలో చిత్రపటం రూపంలో కనపడుతున్నది. ధ్యానమందిరంలో పాలరాతి విగ్రహ రూపంలో ఉన్నది. ఇక్కడ అక్కడ వ్యక్తంగా అవ్యక్తంగా ఉన్నది. రూపసహితంగా రూపరహితంగా ఉన్నది. వాస్తవానికి అమ్మకి అప్పుడు ఇప్పుడు పోలికలు వ్యత్యాసాలు అంటూ లేవు. "ఏకంసత్" ఆ ఒక్కటి ఎప్పుడూ ఒక్కటే. అవతార రూపంలో వ్యక్తిగా ఉన్నప్పుడు ప్రస్తుతం అవ్యక్తంగా ఉన్నప్పుడు భౌతిక వ్యవస్థలో వ్యత్యాసాన్ని మాత్రమే చెప్పుకుని

తాత్త్వికంగా లోతుగా అధ్యయనం చెయ్యాలి. "అవతారమూర్తి ఆవిర్భావం వరదవెల్లువలాంటిది" అంటారు పరమహంస. అదేవిధంగా అమ్మ వ్యక్తిగా ఉన్నంతవరకు బాహ్యమయిన వ్యవస్థలో కార్యక్రమాలు జనం రావటం జరిగింది. అప్పుడు ఇప్పుడు పోలికల విషయంలో వ్యక్తులుగా విడివిడిగా అమ్మ ఇచ్చిన అనుభూతులు ఉన్నవి. ప్రస్తుతం సంస్థ యొక్క వ్యవస్థలో సహస్రం వ్యత్యాసం ఉన్నది. 85 జూన్ 12 అమ్మ మహాసిద్ధి పొందినది. 87లో మే 5న అనసూయేశ్వరాలయంలో విగ్రహ ప్రతిష్ఠ జరిగింది. ప్రస్తుతం జనం రావటం తగ్గింది. ఆర్థిక పరిస్థితి బాగా లేదు. ఇది ఇక్కడ వచ్చిన మార్పు.

ఇతర స్థలాలలో కొంత మెరుగైన మార్పు వచ్చింది. అమ్మ జన్మ స్థలం అయిన మన్నవలో ఇదివరకు లేని అమ్మగుడి ఏర్పడింది. హైదరాబాద్‌లో అమ్మ గుడికి స్థలం కొనటం జరిగింది. 4 ఆదివారాలు రెండు, మూడు శనివారాలలో మొత్తం నెలకి 6 చోట్ల పూజలు జరుగుతున్నది. అమ్మ జన్మదినోత్సవం, కళ్యాణ మహోత్సవం, ఆరాధనోత్సవం (జూన్ 12) ఆగష్టు 15 (అన్నపూర్ణాలయం ప్రారంభం రోజు) హైమ జన్మదినం, ధాన్యాభిషేకం ఫిబ్రవరి 17 (నాన్నగారి ఆరాధనోత్సవం) మొదలైన కార్యక్రమాలు హైదరాబాదులో జరుగుతున్నవి. "విశాఖపట్నం", "కాకినాడ"లలో అమ్మ కార్యక్రమాలు జరుగుతున్నవి. అమ్మ అవ్యక్తం అయిన తరువాత జిల్లెళ్ళమూడిలోను ఇతర స్థలాలలోను వచ్చిన మార్పులివి.

డాక్టర్ పాట్లూరి సుబ్బారావుగారితో "ఇది తిరుపతిని మించిన క్షేత్రం అవుతుందని, జమ్ములపాలెం ప్రాంతంలో విమానాశ్రయం వస్తుందని" ఈ విధంగా చాలా విషయాలు చెప్పారు అమ్మ. "నాకు అంతా వర్తమానమే" అన్నారు. కనుక డాక్టర్ గారితో చెప్పినవన్నీ జరుగుతవి. ప్రస్తుతం పరిస్థితి కొంత అయోమయావస్థగా ఉండవచ్చు. పండిఎండిన విత్తనం భూమిలో పడినప్పుడు అక్కడ ఏమీ కనపడదు. తొలుకరిజల్లుపడిన తరువాత మొక్కలు మొలిచి మహావృక్షాలై సస్యశ్యామలమవుతుంది.

**వివేకానంద** : "వేళ్ళతోను పునాదులతోను వ్యవహరించునప్పుడు పురోగమనము మందముగానే ఉండును. కాని ఆ భావములు ఒక మార్గమున కాకపోయినను మరియొక మార్గమున అయినను వ్యాపింపగలవని నేను చెప్పనక్కరలేదు." వాస్తవానికి అమ్మ సర్వం అయినప్పటికి ఈనాటి భౌతిక వ్యవస్థని వివరించుకొనుటకు వివేకానంద ప్రబోధం సమన్వయం అవుతుంది. వేరుగా పునాదిగా అమ్మ నిలిచి వ్యవహరిస్తున్నది. వివేకానంద పరిభాషలో చెప్పినట్లు ఆభావములు ఒక మార్గంలో కాకపోయిన మరియొక మార్గంలోనైనను అన్నట్లు, అంటే ప్రస్తుతం ఇతఃపూర్వం వివరించినట్లు అమ్మ కార్యక్రమాలు అనేక చోట్ల జరుగుతున్నట్లు వ్యాపిస్తూ పాట్లూరి సుబ్బారావుగారికి చెప్పినట్లు కాలగమనంలో కొంతకాలానికి అక్కడే మార్పువచ్చి వ్యాపించి అవ్యక్తంగా ఉన్న ఆశయ మహావృక్షం యొక్క ఫలపుష్పాదులు

వ్యక్తమవుతయ్. అమ్మ యొక్క ఉనికిని జరుగుతున్న దానిని వివేకానంద పైవిధంగా వివరించారా! అనిపిస్తుంది.

అవ్యక్తంగా ఉన్న అమ్మ ఉనికి-శక్తి మనం గమనించలేనంతగా ఏవిధంగా ఉంటుందో వివేకానంద ఈ క్రింది విధంగా వివరించారు.

**వివేకానంద** : "ఉన్న శక్తి అంతయు సూక్ష్మదశలో ఉండును. ఆ దశలో మనకే చలనము కనపడదు. కారణము ఆ సూక్ష్మదశలో మనము చూడలేనంతగా వేగముగా తీక్షణముగా ఆచలనము ఉండును." వివేకానంద వివరించినట్లు అమ్మ సూక్ష్మదశ మనం చూడలేనంతగా తీక్షణముగా వేగంగా వుంటుంది. అయినప్పటికి మనం చేయగలిగినంత తీక్షణంగా వేగంగా అమ్మకి అంకితమయి చేద్దాం.

**మహాసిద్ధి పొందకముందు అమ్మ-ఆవరణం** : నాన్నగార్ని ఆలయంలో ప్రతిష్ఠించకముందు ప్రతి మే5కి అనసూయేశ్వరాలయం ఎక్కి గుమ్మడికాయలు, కొబ్బరికాయలు కొట్టి పసుపు కుంకుమ పూలు వెదచల్లి కర్పూరం వెలిగించే కార్యక్రమం ఒక మహోత్సవంగా చేసేది. ఇది చూడటానికి అమ్మ సంతాన కోటి విరివిగా వచ్చెడివారు. నాన్నగార్ని ఆలయంలో ప్రతిష్ఠించిన తరువాత అమ్మ గుడి ఎక్కటం మానివేసింది. 83 ఏప్రియల్ 6వ తేదీన అమ్మ వజ్రోత్సవాలు వైభవంగా జరిగినది. 60వేల మంది అమ్మ ప్రసాదం స్వీకరించి అమ్మని దర్శించుకున్నారు. షష్ఠిపూర్తి జరిగిన

శుభసమయమది. 83 మే5కి అమ్మ వేదిక ఎక్కలేదు. అమ్మదేహ పరిస్థితి ఏమాత్రం బాగాలేదని అన్నారు. తదనంతరం 83 నుండి 85లోగా సామూహిక కార్యక్రమాలు హోరెత్తేటట్లు జరిపించింది. లలితా కోటి నామార్చనలు, గాయత్రీయాగం, ఊర్లోజనానికి బట్టలు పెట్టి భోజనాలు పెట్టటం, ఊర్లో పశువులన్నీ ఒకచోట చేర్చి మేతవేయటం కూడా ఒక ఉత్సవంగా చేసింది. రఘువరదాసు గారి బృందంతో రామనామ సంకీర్తన సప్తసప్తాహాలు ఏరోజు కారోజు పెళ్ళిలాగ జరిపింది. వారందరికీ శాలువాలు ఇచ్చారు. నామ వ్యాఖ్యానంతో రామలీలలు, భక్తమార్కండేయ, అమ్మ బాల్యజీవన ఘట్టాలు "అమ్మ లీలలు" అనెడి పేరుతో వైభవంగా ప్రదర్శించారు. అమ్మ గుడిగోపురం పూర్తిఅయి కలశ స్థాపన జరిగింది. అమ్మ తానుగా ఈ కార్యక్రమం చేయక లక్ష్మణ యతీంద్రుల వారి చేత చేయించి వాత్సల్యాలయం ముందు కూర్చుని తిలకించింది. ఆవరణలో అందరి ఇండ్లకి వెళ్ళింది. విద్యార్థినీ విద్యార్థుల గదులకి కూడా వెళ్ళింది. ఉచిత వైద్య శిబిరాలు పెట్టటానికి ప్రోత్సాహం ఇచ్చింది. సాంబ్రాణీ కడ్డీలు తయారుచేసే చిన్నతరహా పరిశ్రమ ఏర్పాటు చేసింది. ఈ విధమయిన విపరీతమయిన కార్యక్రమాలతో ఆవరణం కళకళ లాడింది.

గుడి కలశ స్థాపన జరిగినప్పటి నుండి ఎందరిలోనో ఆవేదన భయం బయలుదేరింది. అమ్మ వ్యక్తిగా అవ్యక్తం అవుతుందని, మహాసిద్ధికి ఏర్పాట్లని భావించారు. గుడి దగ్గర రుద్రయాగం జరిపారు. అప్పుడు అమ్మ ఒక

కుక్కకి బొట్టుపెట్టి పూలమాలవేసి పూలు చల్లింది. తరువాత అది ఎక్కడికి వెళ్ళిందో ఎవరికీ తెలియదు. 85 శ్రీరామనవమికి అమ్మని మేనాలో తెస్తుంటే మేనా విరిగింది. ఆ రోజులలో అమ్మ రెండవ కుమారుడు రవి వాళ్ళ ఇంటి మీద అమ్మ ఉన్నది. అమ్మ పెద్ద కుమారుడు సుబ్బారావు కూతురు హైమ అమ్మ మహాసిద్ధి పొందిన తరువాత నాతో ఒక మాట చెప్పింది. హైమ వెళ్ళి అమ్మతో "మా ఇంటికి కూడా రా బామ్మా!" అంటే అమ్మ తరువాత వస్తానులే అమ్మ అప్పుడు పాలతోనే స్నానం చేయిద్దుగానివి" అన్నదని చెప్పింది. మహాసిద్ధి పొందిన తరువాత అందరూ అమ్మకి పాలతో అభిషేకం చేశారు. జరగపోయే దానిని ఆవిధంగా అన్నదని హైమకి తరువాతగాని అర్థం కాలేదు. ఈవిధంగా తన నిర్ణయాన్ని కొందరితో పరోక్షంగా ముందుగానే అన్నారు. ఏడవమైలులో ఆర్చి ముందుకీ వెనక్కి ఊగేది అమ్మ మహాసిద్ధి పొందక ముందు. ఇట్లా ఊగుతున్నది కదా అని ఆర్చి ఎట్లా ఊగుతున్నదో ఊగుతూ చూపించేది అమ్మ. అనేకమందికి దానిని చూసిరమ్మని పంపేది.

**తన తీవ్రమయిన కోరికని అమ్మ తెలియచేసిన తీరు** : ఈ కార్యక్రమాలన్నీ ఇదేవిధంగా జరిపించండి. అందరికీ తిండి పెట్టడం వైద్యం బట్టలు పెట్టటం మొదలైనవన్నీ ఇదేవిధంగా జరిపించండి. ఎవరినీ పంపించవద్దు. "ఇకనుండీ ఈ సంస్థే మీకు తల్లి నేను కాదు" అన్నారు. అంటే తను ఒక వ్యక్తి కాదు ఉజ్వలతత్త్వం. తన వ్యక్తిత్వాన్ని ఉజ్వల తాత్త్విక

వ్యవస్థలో ఏవిధంగా విలీనం చేసిందో గమనించాలి. ఇక్కడ ఒక ముఖ్య విషయం గమనించాలి. "ఇవన్నీ ఇట్లాగే జరిపించండి ఈ సంస్థే మీకు తల్లి" అన్నదంటే, ఏదో కార్యక్రమాలు జరపటం సంస్థని చూపించటం కాదు. "అనపేక్షమయిన త్యాగనిరతికి పవిత్ర వాత్సల్యానికి నిరహంకార సమర్పణకి ప్రతిరూపంగా" ఏవిధంగా అమ్మ నిలిచి జరిపిందో అట్లా జరపాలని ప్రబోధించింది. మనం అమ్మని ఎట్టి దివ్యభావంతో ఆరాధించామో అట్లా సంస్థని సేవించి నడపాలని తెలియచేసింది. అట్లా కాక తన ఇష్టానికి ఇతరులను బలిచేస్తూ అధికార ధనకీర్తి దాహాలతో నడపటం నడపటం కాదు. లక్ష్యానికి స్వస్తిచెప్పి సంస్థ రూపాన్ని మాత్రం చూబిస్తే అది నేతి బీరకాయ సంస్థ అవుతుంది. లక్ష్యమా? సంస్థా? అనెడి మీమాంస వచ్చినప్పుడు లక్ష్యం ముఖ్యం. లక్ష్యం కోసం వ్యవస్థ. ఆ వ్యవస్థకి సంస్థ పేరు పెడతాం. లక్ష్యం కొట్టుకుపోయిన వ్యవస్థ యొక్క రూపం నేతిబీరకాయ సంస్థ అవుతుంది. దీనిని గమనించి దేశకాల పాత్రోచితంగా వ్యవహరించి లక్ష్యానికి అనుగుణమయిన సంస్థని నిర్మించుకోవాలి. లక్ష్యానికి అనుగుణమయన వ్యవస్థని ఎవరు ఎక్కడ నిర్మించి నడిపినా అది ఎల్ల అమ్మ సంస్థే. జిల్లెళ్ళమూడే.

**తదనంతరం అమ్మ చెప్పిన విషయాలు** : జన్మస్థలమయిన మన్నవ అందరూ నమస్కరించుకోవలసిన ఊరని, అక్కడ ఊరబంతి పెట్టమని అన్నారు. అదేవిధంగా మెట్టిన ఊరు అయిన రేటూరులో కూడా ఊరబంతి

పెట్టమన్నారు. ఇంకా ఈవిధంగా "నా కోరిక ఒకటి తీర్చండి మల్లాప్రగడ శ్రీరంగారావుగారిని పిలిపించి ఉపనిషత్తులు చెప్పించండి. కాలేజీ కాన్వెంటు తెరిచిన తరువాత అందర్నీ స్నానాలు చేసి వచ్చి కూర్చుని వినమని "ఈవిధంగా వారిచేత ఉపనిషత్తులు చెప్పించమని అన్నారు. అక్కడ ఒక హఠయోగ కేంద్ర ఏర్పడాలని అన్నారు. ఒకసారి నాతో "ఇక్కడ ఆధ్యాత్మిక ఆరోగ్య కేంద్రాలు అన్నపూర్ణాలయం ఆదరణా లయాలతో పాటు "దయాల్‌భాగ్" లోలాగ పరిశ్రమలు ఏర్పడి వారి జీవనం చూసుకుంటూ ఇక్కడ కార్యక్రమాలలో పాల్గొనాలని తెలియచేశారు. భౌతికమయిన అవసరాలు తీరి వికాసానికి కావలసిన వ్యవస్థ ఒకవైపు-ఆధ్యాత్మిక ఔన్నత్యానికి కావలసిన సంస్కార కేంద్రాలకి నిలయమై విరాజిల్లాలని చెప్పారు. దీనినే "యతో అభ్యుదయ నిశ్శ్రేయ సిద్ధిఃధర్మః" అన్నారు ఆర్యులు. భౌతికమయిన వికాసాన్ని-ఆధ్యాత్మికమయిన ఉన్నతిని (సిద్ధిని) కలుగచేసేది ధర్మం అని ఆర్యులు ఘోషించారు. ఇట్టి ధర్మమే అమ్మ-వ్యవస్థ.

## అమ్మ దేహస్థితి-చివరగా అమ్మ ప్రకటనలోని తాత్త్వికవివరణ :

85 మే నుండే అమ్మకి బాగుండలేదు. జూన్ ఒకటి నుండి విపరీతమయినది. అయినప్పటికి ప్రతివారికి దర్శనం ఇస్తూనే ఉన్నది. ఎవరైనా అమ్మతో "రోగాల్ని పంపించేసేయ్" అంటే "అవికూడా బిడ్డలే.

మీరు ఎట్లా వెళ్ళలేమంటున్నారో వదిలి ఉండలేరో అవి కూడా అంతే" అనేవారు అమ్మ. తన తండ్రిని తలుచుకుంటూ "నాన్నా! నాన్నా! అంటూ అందరివంక చూస్తూ అనేవారు. అక్కడ ఉండి వెళ్ళినవారిని వస్తూపోతూ ఉండేవారిని పేరుపేరునా పిలిపించుకునేది. అమ్మ దగ్గప్రక్కన బిల్డింగులో పడుకున్న వారికి వినపడేది. ఆయాసంతో ఎగిరి పడుతున్న అమ్మ గుండెలను చూడలేక పోయేవారు జనం. విశ్వాన్నంతా అంబరంగా ధరించిన విశ్వంబరధరి అమ్మ దేహం మీద విశ్వకోటి బాధాగాధల విషాద ఘట్టాలన్నీ అమ్మ దేహం మీద తాండవం చేసినయ్యా అనిపించింది. ఇటువంటి దశలో కూడా ఎవరు వెళ్ళినా "అన్నం తిన్నావా?" అని సంజ్ఞ చేస్తూ (చేతితో) అడిగేవారు. కొందరిని వారివారి కుటుంబ పరిస్థితి చెబుతూ వారెట్లా ఉండాలో ప్రేమపూరితమయిన ఆవేదన హృదయంతో చెప్పేది. దేహాన్ని దూది నేకినట్లు ఏకింది. దధీచి అనెడి మహర్షి దేవగణ సమాజ సంరక్షణ కోసం యోగాగ్నితో తన దేహాన్ని దహింపచేస్తే, సకల విశ్వశ్రేయస్సు కోసం మాతృవాత్సల్య ప్రపూర్ణమైన త్యాగాగ్నితో అణువణువు క్షణక్షణం దహింపచేసిన దధీచిని మించిన అభినవ దధీచి అమ్మ. డాక్టర్ పాట్లూరి సుబ్బారావుగారితో "విసుగు పుట్టేదాక బాధలు తెచ్చుకుని పోతానని, వెంకటేశ్వర స్వామి ఎందుకయ్యాడు" అన్నది. విసుగు పుట్టటం వేరు భరాయించలేకపోవటం వేరు. సృష్టి స్పందనే స్వీయ స్పందన, స్వీయస్పందనే సృష్టిస్పందన అమ్మది. 66లో ఒకసారి అమ్మ ఉదయం నుండి "వళ్ళు కంపిస్తున్నది" అని సాయంత్రం

"ఇప్పుడు టైం ఎంత అయిందో కనుక్కుని రమ్మని ఒకామెను పంపింది. ఆమె టైం కనుక్కొని వెళ్ళిన రెండు నిమిషాలలో బ్రహ్మాండమయిన భూకంపం వచ్చింది. ఇదే "సృష్టి స్పందనే స్వీయస్పందన" అంటే. మరొకసారి అమ్మకి బాగుండకపోతే మబ్బులు కమ్ముకుని వచ్చి పెనుగాలితో చెట్లన్నీ ఊగిపోయినయ్. అదే సమయంలో అమ్మతో ఉన్న డాక్టర్ ఇనజకుమారికి (ఏ.సి. రూమ్‌లో) తూర్పుదిశలో ఉన్న కిటికీ నుండి చాకలి చెరువు దగ్గర వున్న తాటి చెట్టు ఒకటి అనేక సార్లు క్రిందకి పడుకోవటం మీదకి లేవటం కనపడింది. ఇదే "స్వీయ స్పందనే సృష్టి స్పందన" అంటే. ఇది మనలాగ దాస్యమయిన బాధకాదు. "స్వేచ్ఛాలబ్దము". అంటే స్వేచ్ఛనిచ్చి తాను స్వాగతం పలికితే వచ్చిపోయేవి. అది "జడచేష్ట" వాటికి అస్థిత్వం లేదు. అమ్మ ఆడించినట్లు ఆడేవి. అందుకే అమ్మకి అవి "జడ చేష్టలు". కళ్ళని గిరగిర త్రిప్పుతుంటే గిరగిర తిరుగుతున్నట్లు కనపడుతుంది. కాని త్రిప్పే వ్యక్తి చేతిలో ఉంది అదంతా. అమ్మకి ఇవన్నీ అటువంటివి. సృష్టి అంతా దివ్యమూర్తి అయిన అమ్మలో ప్రతిస్పందించింది. ఉదాహరణకి "ఇది వద్దని' అంటే వచ్చేదానిని భరాయించలేని మనలాంటి స్థితి. "ఇది కావాలి" అంటే లేనిదానిని కావాలి అనుకోవటం. ఈ విషయానికి వచ్చేటప్పటికి ఉన్నదాంతో తృప్తి చెందక అవ్వవచ్చు, ఉన్నది భరాయించలేక అవ్వవచ్చు. రెండూ అసంపూర్ణమే. "ఏదీ కావాలి అనేది అఖ్ఖర్లేంది కావాలి" అని చాటి చెప్పిన అమ్మ సూక్తికి ప్రతిరూపమే అమ్మ. ఇదే స్థిత ప్రజ్ఞత్వం పరిపూర్ణత్వం.

ఒకసారి నాతో అమ్మ ఈవిధంగా అన్నది. "అనాయాసేన మరణం వినాదైన్యేన జీవనం" అనేది కూడా కోరికేరా" అన్నారు. తా॥ దైన్యము దారిద్ర్యము లేని సుఖమయ జీవనం. ఆయాసం బాధ లేని మరణం కావాలని "సామాన్య మానవుడు కోరుకుంటాడు. కారణం అమ్మ అంతటి పరిపూర్ణత్వాన్ని అందుకోలేదు కనుక. కాని అమ్మలోని పూర్ణత్వాన్ని అవగతం చేసుకొనటంలో మనలాగ ఊహించకూడదు. అమ్మ బాహ్య ఉనికికి ఆత్మైక స్థితికి సంబంధం లేదు. దానిని దర్శించే స్థితి మనకు లేదు కదా? ఇట్టి మహాత్ముల స్థితిని గురించి అరవిందయోగి ఈ విధంగా చెబుతారు. "విశ్వాత్మతో ఐక్యత చెంది విశ్వచైతన్యంలో నివసించే మహాత్ములు సృష్టిలోని దుష్టశక్తుల్నీ మంచి శక్తుల్నీ తమ దేహంలో నుండి దూసుకుపోయే అవకాశం ఇస్తారని (పరిపూర్ణులు) ఇట్టివారే "పరమ హంసలని" అంటారని వివరిస్తారు. అమ్మ ఇట్టి పరమహంస. ఎట్టి స్థితిలోనైనా వాడని వీడని నిత్యనూతన దివ్యమంగళమయిన మాతృవాత్సల్యామృతశీతల కిరణాలని విశ్వమంతా అందరిపై నింపుతూ నిలచిన అమ్మ ముందు బాధలు లేని భగవంతుడంటూ ఉంటే ఆ దైవం కూడా చిన్నవాడు. అమ్మఒడిలో పాప. ఇట్టి పరిపూర్ణ దివ్యమూర్తి చివరగా చేసిన ప్రకటన వ్యవహరించినతీరు, స్థూలంగా లోతైన దృష్టిలేని వారికి విచిత్రంగా ఉంటుంది. అదేమిటంటే "అందరూ మహానుభావులే. మీ అందరికీ నా నమస్కారాలు. ఎన్నో తప్పులు చేశాను. క్షమించండి". ఇక్కడ ఒక భక్తుడుగా సాధకుడుగా త్యాగరాయస్వామి అన్నమాట గుర్తుకు వస్తుంది.

"ఎందరో మహాను భావులు. వారందరికిని నా వందనములు" అన్నారు. అంటే ఇదే నేతి నేతి మహావాక్యం. ఇది కాదు అని దీనిలో నుండి ప్రత్యేకతని తీసుకుండే ఒక పరిమితమయిన స్థాయి నుండి అన్నమాట. దీనినే "హంస" స్థితి అంటారు. పాలు-నీరు వేరు చేసినట్లు. అయితే ఇది పూర్ణమయిన సహజ నిష్ఠకాదు. దీనినే అమ్మ పరిభాషలో చెప్పాలంటే "సహజంలో నుండి విశేషాన్ని విడదీసి" ఇది భక్తుని స్థితి. కాని అమ్మది పూర్ణత్వం. భక్తులందరూ ఏదివ్యత్వం కోసం పరితపిస్తారో ఆ దైవమే అమ్మ. ఇతః పూర్వం వివరించినట్లు అమ్మ "పరమ• హంస". అందువలన "సర్వంఖల్విదం బ్రహ్మ" అనెడి అనుభూతినుండి "అందరూ మహానుభావులే" అన్నది. అమ్మ పరిభాషలో "విశేషం సహజం కావాలి" అంటే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనెడి శృతి వాక్యం ఒక్కటే. పరిపూర్ణమయిన దివ్యత్వాను భూతి నుండి వెలువడిన అనుభవ జ్ఞానసూక్తి "అందరూ మహానుబావులే" అని అమ్మ ప్రకటించిన వాక్యం. అంత మాత్రం చేత మనం మన స్థాయి నుండి అధికంగా ఊహించుకొనకూడదు. రెండవ ప్రకటన మరీ విచిత్రంగా ఉంటుంది. ఈ ప్రకటనలోని ఆధ్యాత్మిక ధర్మ సూక్ష్మాన్ని వినోబాభావే గీతా ప్రవచనంలో ఈ విధంగా తెలియచేస్తారు. జ్ఞానికి 1) భావావస్థ 2) జ్ఞానావస్థ 3) నిష్క్రియావస్థ అనెడి మూడు దశలు ఉంటవని తెలియచేస్తారు.

**1. భావావస్థ** : జ్ఞాని భావోత్కృష్ట వలన ప్రంచములోని దోషములన్నియు

తనపై వేసుకొనును. జ్ఞాని త్రిలోకముల పాపముల వలన తాను పాపిగను, పుణ్యముల వలన పుణ్యవంతుడుగను అగుచుండును. అట్లయినను ఆ పాప పుణ్యములు అతనిని స్పృశింపనేరవు. ఈ భావావస్థలో సకల పాపపుణ్యములు అతని ద్వారా జరుగుచున్నట్లు గోచరించుచుండును. ఈ విషయములనే అతడు స్వానుభవముగా చెప్పుచుండును. "చేయరాని (పాపములు) కార్యములెన్నో చేసితిని, చేయుచున్నాను, చేయుదును అని ఋషి అనలేదా? (వినోబాజీ ఋషి పేరు చెప్పలేదు) ఈ భావావస్థ లభించిన మీదట ఆత్మపక్షివలె ఎగుర నారంభించును. అది ఈ పృచ్ఛశరీరము దాటిపైకి పోవును." ఇతఃపూర్వం అమ్మ చేసిన రెండవ ప్రకటన ఇట్టి దశ నుండి చెప్పినది. దివ్యమూర్తి అయిన అమ్మ భావావస్థ మనలాంటిది కాదు. సకల మానవుల జీవరాసులతోను విశ్వాత్మతోను ఐక్యత చెందినస్థితి. లవలేశం కూడా అహంకారంలేని గుణాలకి కాలానికి అతీతమయిన ఉజ్వలజ్ఞానంతో కూడుకున్న భావావస్థ అది. కనుక సర్వం తనపై వేసుకుని చెప్పింది. అంతేకాని మనకు కనిపించిన అనసూయాదేవి అనబడే వ్యక్తిగా తాను చేసినదని కాదు. డాక్టర్ పాట్లూరి సుబ్బారావుగారు అమ్మని దర్శించిన క్రొత్తలో తాను ఆధ్యాత్మిక సాధనలు చేశానని, వ్యాయామాలు యోగ సాధనలు చేశానని ఎన్నో విద్యలు నేర్చుకున్నానని అమ్మతో అంటే అమ్మ "అవన్నీ నీచేత చేయించింది నేను, నీవుకాదు" అన్నారు. డాక్టర్ గారు చేసిన విశిష్ఠ కార్యములకు తనే కారణమన్నది. ఈవిధంగా జ్ఞాని యొక్క భావావస్థలో

సకల పాప పుణ్యములు తన ద్వారా జరుగుచున్నట్లు గోచరిస్తూ చెప్పినది. 85 జూన్ 12 ముందు అమ్మ చేసిన ఆధ్యాత్మిక ధర్మసూక్ష్మాన్ని గ్రహించి పరిమితమయిన మానవ పరిధికి అందని దివ్యమూర్తి అమ్మకి అంకితమవుదాం.

జ్ఞానావస్థలో పాపపుణ్యాలన్నీ విదిల్చివేసి సర్వం దగ్ధం అవుతున్నా దాని స్పర్శయేలేని నిస్సంగత్వంతో కూడుకున్న మోక్షదశ సంభవిస్తుంది అంటారు. అయితే అమ్మకి ఈ దశలన్నీ సంభవించటం కాదు. ఈ దశలన్నీ అమ్మ నుండి ప్రతిస్పందించినయ్. వినోభాభావే వివరణ నుండి మనం వాటిని గ్రహించటానికి దోహదం చేస్తుంది. 77 తుఫాను కాని మరియొక సందర్భాలలో కాని ప్రకృతి అంతా విలయ తాండవం చేస్తున్నా అన్నీ కొట్టుకుపోతున్నా నవ్వుతూ నిరామయంగా చూస్తూ ఉండేది. వచ్చేడి కష్టనష్టాలకి తొణకని మేరు పర్వతంలా ఉండేది. ఇట్లా జ్ఞానావస్థ యొక్క మోక్ష దశ కనపడుతుంది.

**నిష్క్రియావస్థ** : కర్మల యొక్క కర్తృత్వం తనపై వేసి కొనకుండుట. అమ్మ అనేక సందర్భాలలో "జరిగింది" అంటానే కాని "చేశాను" అని అనను అనేవారు. నేను పెట్టటం కాదు వాడి అన్నం వాడు తినిపోతున్నాడు అనేవారు. ఎన్ని మహోన్నత కార్యక్రమాలు జరుగుతున్నా తనపై కర్తృత్వాన్ని వేసుకునేవారు కాదు. ఈ విధంగా పైన వివరించిన జ్ఞాని యొక్క నిష్క్రియావస్థ కనపడుతుంది అమ్మలో.

అన్ని దశలు తానే అయి అన్నింటికి అతీతమయిన అమ్మ ఎక్కడికక్కడ అన్ని దశలకు సమన్వయం అవుతూ సర్వానికి అతీతమయి విరాజిల్లే విశ్వజనని అయి భాసిల్లింది. ఏకపక్షంగా ఆలోచించే వారికి ఎప్పుడూ సమన్వయం కాదు. లేదా ఇదే అమ్మ స్థితి అని వెఱ్ఱిమొండి వైఖరి ఉన్నవారు ఏకపక్షంగా అవగతం చేసుకున్న వారు అవుతారు. వీరూ అయోమయం అవుతారు. కనుక సర్వతో ముఖంగా అమ్మని అవగతం చేసుకుని అంకితమవుదాం.

**అంతంలేని అమ్మ** : ఆద్యంతరహితమయిన అమ్మకి పరిసమాప్తి లేదు. వ్యక్తిగా అవ్యక్తమయింది. అవ్యక్తమవటం వేరు లేకపోవటం వేరు. "నాటక రచయితే నటనలో పాత్రధారి అయినట్లు" అని అవతారాన్ని గురించి వివరించారు అమ్మ. అంటే సర్వంతానై కూడా పరిమితమయిన పాత్రని ధరించిన మహోజ్వల స్థితి. సకల విశ్వాన్ని పాత్రలను నిర్మాణం చేసింది, వీటన్నింటిని నడిపేది, తాను ప్రత్యేకమయిన అస్థిత్వంతో పాత్రధారియైనది అని వివరించారు.

కర్త-కర్మ-క్రియ ఈమూడూ తానైనది. విశ్వాన్ని పాత్రలను నిర్మాణం చేసిన దశ కర్త. నడపటం కర్మ. తానుగా నిర్ణయించుకున్న పనితో పాత్రధారియైన రూపం క్రియ. ఈ మూడూ తానైన అమ్మ తన పాత్రను నిర్వహించి తెరవెనుకకు వెళ్ళినా తరువాత జగన్నాటకమును నడపవలసినది

అమ్మే. అనంతతత్త్వం ప్రత్యేకత్వం రెండూ అయి ఉండటం సాధ్యమయిన అమ్మ అస్తిత్వానికి పరిసమాప్తి అన్న ప్రసక్తి లేదు. మౌళికమయిన ఈ సూత్రాన్ని కొంచెము వివరించవలసి వస్తుంది. అమ్మ వ్యక్తిగా ఉన్నప్పుడు అనేకమందికి చాలా చోట్ల ఎన్నో అనుభూతులు కలిగినవి. మరిజిల్లెళ్ళమూడిలో అనసూయ రూపంలో ఉన్న అమ్మ ఎక్కడికి కదలలేదు. కాని ఎన్నో చోట్ల ఎంతో మంది పొందిన అనుభూతి పరిమితమయిన భౌతికకాయంతో కదిలి వెళ్ళటం వలన కాదు. అందుకనే ఎందరెందరో జిల్లెళ్ళమూడి వచ్చి చూసింది 1) పరిమితమయిన రూపం 2) ఆరాధించినది అనంత చైతన్యతత్త్వం. 3) అనుభూతి దివ్య మాతృ ప్రేమానుభూతి. దర్శనం ఆరాధన అనుభూతి యొక్క సమ్మేళనమే ఉజ్వలమయిన అమ్మ స్థితి. రూపం పరిమితత్త్వం. ఆరాధించినది అపరిమితత్త్వం. అనుభూతి అవ్యక్త హృదయానుభూతితో సేవించబడిన అమ్మ యొక్క బహుముఖత్వం ఇది. "దేహాన్ని కలిగి దేహం కూడా తానే అయినవాడు విదేహి" అన్నారు. "తానే అయినవాడు" అనెడి విశేషాన్ని మనకు అందించారు. అంటే ఆత్మే అయిన దేహం. అట్టివాడు విదేహి అన్నారు. "నాకు దేహం కూడా ఆత్మ" అన్నారు. "నేను ఏమి చెప్పినా నా అనుభవం నుండి చెబుతాను" అన్నారు. అమ్మమాట అనుభవజ్ఞాన ప్రపూర్ణం - అమ్మ దేహం కూడా దివ్యాత్మే. తన విధానాన్ని గురించి చెబుతూ "మరుగేనా విధానం" అన్నారు. ఎప్పటికప్పుడు మాయ తెర మనపై వేస్తుంది అమ్మ.

"ప్రాణం అంటే ఏమిటో తెలుసుకుంటే కాని ఈ సైన్సు పరిసమాప్తి కాదని ప్రాణం పోయిందని అంటున్నారే కాని ప్రాణం అంటే ఏమిటో తెలీదని, శ్వాస ఆగటానికి ప్రాణానికి సంబంధం లేదని చెప్పారు. సర్వం చైతన్యమేనని అచేతనం లేదని, చైతన్యసహిత పరిణామ భరితమయిన ఈ సృష్టి అంతా ప్రాణమేనని వివరించారు అమ్మ. జీవతత్త్వం వీరికి తెలీదన్నారు. "చనిపోయిన కళేబరం నుండి అనేకమయిన పురుగులు ప్రాణులు వస్తున్నాయి కదా? అంతదాకా దేనికి తుడిచే గుడ్డని ఒకచోట పడేస్తే ప్రాణులు వస్తున్నాయి. ఇది కూడా ప్రాణ సహితమే. "అలుకు గుడ్డలో కూడా దైవాన్ని చూడమని చెబితే దైవాన్ని కూడా అలుకుగుడ్డగా చూస్తున్నారు" అన్నారు. ఒకసారి విద్యుచ్ఛక్తి-ప్రాణశక్తి ప్రస్తావన వస్తే "ప్రాణశక్తి ముందు విద్యుత్ శక్తి చాలా చిన్నది" అని చెప్పారు. "నిర్ణయానికి నిర్ణయించినవాడు కూడా బద్ధుడే" అన్నారు. ఉదాహరణకి ఆంజనేయుడు బ్రహ్మాస్త్రానికి కావాలని బద్ధుడైనట్లు, అది శక్తి విహీనుడై స్వతంత్రత కోల్పోయిన బద్ధతకాదు. రావణుని చూడటానికి తనకు తానుగా బద్ధుడైనాడు. కార్యకారణాలకి అతీతమయిన మహాకారణ స్వరూపిణి అమ్మకి కూడా తన నిర్ణయ బంధం అటువంటిదే. కాలస్వరూపిణే తానైన అమ్మకి కాల నియమం లేదు. "ఆధారం ఎప్పుడూ అజ్ఞాతంగా ఉంటుంది. నేను ఎప్పుడూ మీవెన్నంటి ఉన్నాను" అన్నారు. అజ్ఞాతంగా సర్వానికి ఆధారమయిన అమ్మ ఉనికి నిరంతరం మనందరికి ఉంటుంది. "ఎవ్వరూ నా ఒడివిడిచిలేరు. తల్లి

రక్షణ కాదు రక్షణే తల్లి" అని ప్రబోధించారు. మనమంతా అమ్మ ఒడిలోనే ఉన్నాం. రక్షణే తానైన అమ్మ రక్షమనందరికి సురక్ష, శాశ్వతం.

ప్రాణాయామ సాధనలో ఒక స్థాయికి వస్తే సంకల్పానికి తగ్గట్లుగా ప్రాణశక్తిని నడిపించవచ్చని, శ్వాసవల్ల ప్రాణశక్తి నడుస్తుందా? ప్రాణం వల్ల శ్వాస నడుస్తుందా? అంటే ప్రాణశక్తివల్ల శ్వాస నడుస్తుంది అంటారు వివేకానంద. కాలం-గుణం-ప్రకృతి, ప్రాణశక్తికి అతీతమయి సర్వాన్ని స్వాధీనం చేసుకున్న సాధ్వి అయిన అమ్మ సర్వతంత్ర స్వతంత్రమయినది. వివేకానంద చెప్పినట్లు సాధకుల దశే అటువంటిదైతే సాధనలకి గమ్యమే తానైన అమ్మకి శాశ్వత ఉనికి విషయంలో ప్రశ్నేలేదు. మనలాగ ప్రకృతి, గుణాలు, కాలానికి బద్ధమయిన అస్వతంత్ర బద్ధం కాదు అమ్మది. తన నిర్ణయానికి తానుగా కల్పించుకున్న బంధం. తన నిర్ణయానికి బద్ధమయి (స్వతంత్రంగా) మనందరికి తెరమరుగువేసి తన స్థితిని మార్చుకుని అపరిమితత్వంతో (సంపూర్ణత్వం) పరిమితత్వం సాధ్యమయిన అమ్మ సర్వతంత్ర స్వతంత్రమై తానుగా ఆలయంలో ప్రవేశించి శాశ్వతంగా నిలిచింది. కారణావతారాలు వారు వచ్చిన కారణం పూర్తిచేసి పరిసమాప్తి అవుతారు. "అమ్మ అంటే అవతారం కాదు. పరిపూర్ణత్వం అన్నారు. నా రాకకు కారణం లేదని, కార్యకారణాలు తానే అయి తనవే అయి వీటికి అతీతమయి ఏకారణం లేకుండా వచ్చింది పరిపూర్ణావతారం" అని విశదీకరించారు. కారణం లేదు అంటే ఇదే కారణం అని పరిధి లేదు అని అర్థం. సర్వకారణాలకి శాశ్వత

పరిష్కారం అమ్మలోని అకారణం. అమ్మకి పరిసమాప్తి లేదు. అంతం లేనిది అమ్మ. వివేకానంద మాటల్లో చెప్పాలంటే "పరిపూర్ణులైన తర్వాత స్వతంత్రపనిచ్ఛేదాన్ని కల్పించుకుంటారు."

## ఆలయ నిర్మాణం-ప్రవేశంలోని విశిష్ఠత-ఆలయతత్త్వం :

"కాలవ నిండుగా ప్రవహిస్తున్నా దాహమయితే దిగటానికి రేవు కావాలి" అని అమ్మ ఉవాచ. రామకృష్ణ పరమహంస ఈ విధంగా అంటారు. "ఆవు నెత్తురు నుండి పాలు వచ్చినా పిండుకోవాలంటే ఆవు పొదుగు నుండే పిండు కోవాలి", అదే విధంగా ఆధ్యాత్మికతత్త్వాన్ని గ్రహించాలన్నా దివ్య భావ స్పందన కలగటానికి మహాత్ముల నిలయాలు, క్షేత్రాలు, ఆలయాలు అటువంటివి" అంటారు. నిర్మల గంగానది ఒడ్డున బావి త్రవ్వవలసిన పనిలేనట్లు అయాచితంగా అప్రయత్నంగా అట్టి నిలయాలలో దివ్యభావ స్పందన కలుగుతుంది.

జిల్లెళ్ళమూడిలో ఆలయ నిర్మాణం చాలా విచిత్రమయినది, విశేష మయినది. సహజంగా లోకంలో ఫలానా ఆలయం నిర్మాణం అని నిర్ణయించుకుని లోకులు కడతారు. జిల్లెళ్ళమూడిలో అట్లాకాదు. ఆలయ శంఖుస్థాపన జరిగి నిర్మాణం అవుతున్న రోజులలో ఎవర్ని అడిగినా వారి ఊహల్ని బట్టి ఒకరు రాజరాజేశ్వరి అని మరొకరు రాముని ఆలయం అని చెప్పారే కాని ఎవరికీ తెలీదు. కన్యాకుమారిలాగ అమ్మ వ్యక్తిగా వెళ్ళి

కూర్చుని ప్రతిమ లాగ మారిపోతుంది అనుకున్నారు కొందరు. నాన్నగారు అమరులైన తరువాత వారి భౌతిక దేహాన్ని ఆలయం గర్భగుడిలో అమ్మ స్వయంగా ఖననం చేసి ప్రతిష్ఠించి తరువాత తనని కూడా అక్కడ ప్రతిష్ఠించమని చెప్పినంత వరకు అది అమ్మ ఆలయం అని అనుకోలేదు. ఈ విధంగా మానవ ఊహకి అతీతంగా ముందుగా దైవం అయిన అమ్మ నిర్ణయానికి అనుగుణంగా నిర్మింపబడిన ఆలయమది. ఒక జమీందారు ఆలయ నిర్మాణానికి మొత్తం డబ్బు తను ఇచ్చి కట్టిస్తానని అంటే అమ్మ అట్లావద్దని చెప్పి "దీనిలో ప్రతి ఒక్కరి డబ్బు పడాలని, అయిదు పైసలు పది పైసలు ఇచ్చేడి వారి సమర్పణ దీనిలో ఉండాలని, ప్రతివారి శారీరక శ్రమ, భావ సమర్పణ ఉండాలని" అన్నారు. ఏ ఒక్కరి సమర్పణతో కాక అందరి అమ్మ ఆలయం అందరి సమర్పణలతో నిర్మాణమయి అందరి అమ్మ ఆలయం అయినది. ఏ ఒక్క చిన్న పరిమితత్వాన్ని అలక్ష్యం చేసేది కాదు దివ్యతత్త్వం అని దీని ద్వారా మనం గ్రహించాలి. సమర్పణ ఎంత అనికాదు అమూల్యమయిన హృదయసమర్పణకి విలువ అక్కడ. బంగారపు ముద్దలు, రత్నాలు, మణులకి తూగని భగవంతుడు తులసీదళానికి తూగాడు కదా? మరొక విషయం "శ్రేష్ఠత్వంతో గిరి గీసుకుని కూర్చొనకుండా శ్రేష్ఠత్వంలో అందరినీ విలీనం చేసుకుండే అవకాశం ఇచ్చిన మహదావకాశం అమ్మతత్త్వం". ఇదే అమ్మ ఆలయ నిర్మాణంలో కల ధర్మసూక్ష్మం, ఉజ్వలతత్త్వం."

"నిగ్రహం కోసమే విగ్రహారాధన" అని అమ్మ ప్రబోధం. రూపం-శక్తి-నామం మూడు ఒక్కటేనని, ఇందులో హెచ్చుతగ్గులు లేవన్నారు." దేహమే తానై దివ్యాత్మ అయిన అమ్మ ఆలయ భూగృహంలో "శక్తిగా" అవ్యక్తంగా ఉన్నది. విగ్రహంగా గర్భగుడిలో "రూపంతో" ఉన్నది. అనసూయేశ్వరాలయం అనెడి "నామంగా" ఉన్నది. ఈవిధంగా శక్తి-రూపం-నామం, మూటికి నిలయం అమ్మ ఆలయం. అర్చనకి-స్మరణకి-హృదయానుభూతికి నిలయం అది. విగ్రహం అర్చనకి, స్మరణ మనసుతో చేసేది నోటితో ఉచ్చరించేది. ఇట్టి స్మరణకి నిలయం. అవ్యక్త శక్తి యొక్క హృదయానుభూతికి ఈ మూటికి అవకాశం ఇచ్చెడి మహోన్నత ఆలయం అది. అవతార మూర్తుల రూపారాధనలోని విశిష్ఠత తెలియచేస్తూ రామకృష్ణ పరమహంస ఈ విధంగా తెలియచేస్తారు. మండోదరి రావణునితో "మీకు కామ రూపం విద్యవచ్చు కదా! రాముని రూపంలో వెళ్ళి మీ కోరిక తీర్చుకొనరాదా? అంటే రావణుడు "ఓసీ పిచ్చిదానా లవలేశం కూడా కళంకం లేని ధర్మనిష్ఠా గరిష్ఠుడైన రాముని రూపం ఎప్పుడైతే ధరించానో ఇక నేను ఆ పని చేయలేను" అంటాడని చెబుతారు పరమహంస. కామాంధుడు లోక కంటకుడు అయిన రావణాసురునికే ఆ రూపధారణ అటువంటిదైతే భక్తితో సేవించేవారికి మహోన్నతంగా మార్పు వస్తుంది కదా! శీలసంస్కారం భక్తి హృదయంతో ఆరాధించే వారికి అమ్మ ఆలయం - రూపారాధన కూడా అపారమయిన అమ్మ యొక్క తాత్త్విక శీలసంస్కారాన్ని పరివర్తనని కలుగ

చేస్తుంది. ఆధి వ్యాధులు తీర్చి విద్యాజ్ఞాన ఐశ్వర్యాలను ప్రసాదించే ఆశ్రయమై భాసిల్లుతుంది అమ్మ ఆలయం.

దీపము-ప్రదీపము : దీపము బాహ్యమయిన జగత్తును ప్రకాశింపచేసి చూపించేది అయితే ప్రదీపము అంతర్బాహ్యాలను రెంటిని ప్రకాశింప చేసేదని ఒక అర్థం చెప్పారు. అంతర్బాహ్యాలని ప్రకాశింపచేసి ఇహపరాలను ప్రసాదించే ప్రదీపము అమ్మ. అమ్మపై అచంచల విశ్వాసం కలిగి సర్వతోముఖ అవగాహనతో కూడుకున్న హృదయ సంస్కారంతో కర్పూర కళికలై జ్వలించి ఆ ఆరాధనలో లయమవుదాం.

అమ్మ పాదపద్మాలకు నమస్సులు
తెలియచేస్తూ
**పీయూష**



అమ్మసాన్నిధ్యంలో 1965 నుండి సేవలు చేసుకుంటూ జీవితం గడుపుతున్నాను. 1985 జూన్ 12 న అమ్మ మహాసిద్ధిపొందిన తరువాత అమ్మని గురించి రచన చేయటమే జీవితం అయినది. 1984 సెప్టెంబర్‌లో "నువ్వు కూడా రాయరా! నువ్వు ఇక్కడ చూసింది, అనుభవించింది. నీధ్యేయం నీ చింతనలో వచ్చిన మార్పులు రాయి" అన్నారు. "ఒకనాటి మాట మరొకనాటికి బాట" అన్నారు అమ్మ. తన సూక్తికి తగినట్లుగా 1984 సెప్టెంబర్‌లో అమ్మ సందేశం, 1985 జూన్ 12 తరువాత బాట అయి వ్రాయటం జరిగింది. అమ్మ చింతనే జీవితం, జీవనమై నడుపుతున్న అమ్మకి నమస్సుమాంజలలు సమర్పిస్తూ .

ఇట్లు
పీయూష